Approved by the Text book Committee Madras Vide F. St. G. Gazettee
Page 17 Dated 1-5-1945.

# Panchakavya Kathanidhi.

C. Ramakrishna Rao



CHIDAMBARA GRANDHAMALA,
HAPURAM.

 [Price Rs. 0-10-0

# పంచకావ్యకథానిధి.



రచయిత

విద్వాన్

పిశుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి.



చిదంబరగ్రంథమాల,

పీఠాపురం.

# విజ్ఞాపనము.

కాళిదాస మహాకవిప్రణీతములగు 'రఘువంశ కుమారసంభవ మేఘసందేశములు, భారవికవిరచితమగు 'కిరాతార్జునీయము', మాఘకవికృతమగు 'శిశుపాలవధము' అను నైదు మహాకావ్యములు సంస్కృతభాషలోఁ గలవు. వీనికే పంచకావ్యము లను సుప్రసిద్ధవ్యవహారము కలదు. వీనిని సంస్కృతవిద్యార్థులెల్లరు మొదటఁ బఠించి భాషాజ్ఞానము, సాహిత్యకౌశల్యము, కవితాశక్తి, నీతిసంపద, మొదలగు ప్రజ్ఞలను సంపాదించుచుందురు. పురాణములు ధర్మశాస్త్రములు నితిహాసములు మున్నగు విశేషములను దెలిసికొనుటకుఁ బంచకావ్యములను బఠించుటయే మూలాధారమైయున్నది. కావున నట్టిమహాకావ్యములలోఁ గల కథాసారమును సవిశేషముగా నాంధ్రవిద్యార్థుల కెల్లరకును సులభసాధ్యమగునట్లు నేను శ్రమపడి తెనిఁగించి "పంచకావ్యకథానిధి" అను పేరుపెట్టి ప్రకటించితిని. విద్యాభివృద్ధికాముఁడగు ప్రతివిద్యార్థియును దీనిని బఠింపవలసియున్నది. కావునఁ బాఠశాలలలో దీనిని బఠనీయగ్రంథముగ నియమించి విద్యాశాఖాధికారులును నుపాధ్యాయులును నాకుఁ బ్రోత్సాహమును గలిగింతురుగాక.

ఇట్లు,

పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి.

# వి ష య సూ చి.

# పంచకావ్యకథానిధి.

## రఘువంశము.

చతుస్సముద్రముద్రితమగు మహీమండలమునందు రఘువంశమను సుప్రసిద్ధమగు క్షత్రియవంశ మొకటి కలదు. అందు బాల్యమున సమస్తవిద్య లభ్యసించెడివారును యౌవనమున భోగము లపేక్షించువారును వార్ధకమున మునివృత్తి నవలంబించువారును ప్రాణాంతసమయమున యోగముచే శరీరము విడుచువారును ఫలసిద్ధివఱకును కార్యదీక్ష విడువని వారును త్యాగముకొఱకు ధనమార్జించువారును అసత్యభయమున మితముగా మాటలాడువారును సౌఖ్యమగు సంతానముఁ బడయుటకై గృహస్థాశ్రమము నంగీకరించువారును నగు రాజులు గలరు. వారు ఉత్తరకోసలదేశమున సరయూనదీతీరంబున అయోధ్యానగరంబును రాజధానిగఁ జేసికొని భూమండలమును బాలించుచుండిరి. ఆ యయోధ్యాపురము మహాఁదుయో

జనముల విస్తారమును బండ్రెండు యోజనముల పొడవును గలిగి సకలవస్తుసంపదలతోఁ దులదూగుచు నుండెను.

## —: దిలీపమహారాజచరిత్ర :—

వేదములలోఁ బ్రణవమువలె రఘువంశస్థులలో వైవస్వతుఁడు మొదటివాఁడు. తద్వంశమునఁ బాలసంద్రమునఁ జంద్రుఁ డుదయించినట్లు దిలీపుఁ డుద్భవించెను. అతఁడు సుగుణసంపన్నుఁడు, పరాక్రమవంతుఁడు, ప్రజలను దండ్రివలె రక్షించువాఁడు, ధర్మకార్యనిరతుఁడు. అతని కీడగువాఁ డాకాలపు రాజన్యులలో నొక్కఁడను లేఁడు. అతనికి మగధవంశజాతయగు సుదక్షిణయను భార్య కలదు. అతఁ డాత్మానురూపయగు ధర్మపత్నియందు సకలభోగముల ననుభవించుచు సుఖముగ రాజ్యమును బాలించుచుండెను. కాని యతని కెంతకాలము గడచినను సంతానము మాత్రము గలుగదయ్యె. అందులకాతఁడు చింతాక్రాంతస్వాంతుడై రాజ్యపాలనాభారమునంతయు మంత్రులయందుంచి సంతానార్థము పలువ్రతము లాచరించి ప్రయోజనముం గాక యొకనాఁడు భార్యతోఁ గూడి కులగురుం డగు వసిష్ఠమహాముని యాశ్రమమున కరిగెను.

వసిష్ఠమునీంద్రుఁడు సాయంకాలానుష్ఠానముం దీర్చి కొని యరుంధతీద్వితీయుఁడై స్వాహాయుతుఁడగు వీతిహో

త్రుని చందంబున సుఖాసనాసీనుఁ డై యున్న సమయంబున సుదక్షిణాదిలీపు లిరువురును నెదుటికివచ్చి సాష్టాంగప్రణామంబులాచరించిరి. అంతట మునిదంపతు లాశీర్వాదములు చేసి రాజదంపతుల నుచితాసనాసీనులఁ గావించి కుశలప్రశ్నములు చేసిరి. దిలీపమహారాజు చేతులు జోడించి దేవా! నీప్రభావంబున నా రాజ్యమునందు క్షామాదిబాధారహితులై జనులు సుఖవంతులుగ నున్నారు. మే మెల్లరమును నీయనుగ్రహంబునఁ గుశలవంతులము. కాని పుత్త్రహీనుఁడ నగు నాకు రత్నగర్భయగు భూమిసయితము సంతోషావహముగాకున్నయది. నాయనంతరము పితృదేవతలు తమకు నివాపాంజలు లిచ్చెడివా రుండరని మిగుల వగతురు. సంతానహీనుఁడ నగు నేనిహపరలోకసుఖదూరుఁడనై దుఃఖసాగరమున మునిఁగియుంటిని. నీరు పోసి కష్టించి పెంచిన యాశ్రమవృక్షము ఫలపుష్పపల్లవశూన్యమై మోడువలెనుండ నీహృదయ మెట్లుపరితపించుచున్నది? తండ్రీ! నన్నీపితౄణబంధమునుండి విముక్తునిఁ జేయు నీకంటె సమర్థుఁడు లేఁడు. ఇక్ష్వాకువంశస్థుల కాపదలు తటస్థించినపుడు మొదటినుండియు నవియన్నియును దొలఁగించుచున్నవాఁడవు నీవేకదా? అని వినయంబునఁ బలికెను.

దయార్ద్రహృదయుఁడగు వసిష్ఠమహాముని యవ్వలుకు లాలించి క్షణకాలము ధ్యానస్తిమితలోచనుఁడై యోగదృష్టి

ని సర్వము సెఱింగి కన్నులువిచ్చి చూచి రాజేంద్రా! నీవు పూర్వము దేవేంద్రునియొద్దకేగి తిరిగి వచ్చుచుండఁ గల్పవృక్షము నీడఁ గామధేనువు పరుండియుండెను. ఆధేను వెల్లరకును దప్పక యారాధింపఁదగినది. నీవపుడు సమయము మించిన ధర్మలోపము గలుగునను భయంబున ఋతుస్నాత యగు భార్యను గలియుటకై సత్వరముగ వచ్చుచు మార్గమధ్యమందుండు నాధేనువును జూడకపోతివి. దాన నక్కామధేనువు కుపితయై రాజా! పూజార్హ నగు నన్నుఁ దిరస్కరించితివి. కావున నన్నుఁ గాని నాసంతానమును గాని యారాధింపనిచో నీకు సంతతి కలుగకుండుఁగాక యని నిన్ను శపించెను. అశ్శాపవాక్యమును నీవుగాని నీవెంట నుండు సారథి గాని తెలిసికొనలేకపోతిరి. పూజనీయుల నర్చింపకుండుట శ్రేయంబులకుఁ బ్రతిబంధకము. తచ్ఛాపకారణంబున నీకు సంతతి కలుగలేదు.

ఇప్పుడు పాతాళలోకమున వ్యాసమహర్షి దీర్ఘసత్త్రయాగము సలుపుచున్నాఁడు. అందు హవిస్సునకుఁ గావలసిన పాలు పెరుఁగు నెయ్యి మొదలగు పదార్థముల నిచ్చుటకుఁ గామధేను వచ్చటనే యున్నది. ఆప్రదేశమును బరులు చొచ్చుటకు వీలు లేకుండ ఘోరసర్పములు పరివేష్టించియున్నవి. అచటి కరుగుట సులభముగాదు. కావున నీవిపు డాకామధేనుపుత్రియగు నందినీధేనువును జిత్తశుద్ధి గలిగి ధర్మపత్ని

తోఁ గూడి నియమపాలనముఁ జేయుచు సేవించితివేని యా నందిని నీయారాధనమునకు సంతృప్తిఁ జెంది నీమనోరథము నీడేర్పఁ గలదు. అని నుడువుచుండెను. అంతలో నందినీధేను వచటికి వచ్చెను. అది చూచి శకునజ్ఞుఁడగు వసిష్ఠుఁడు రాజా! నీకోర్కె శీఘ్రకాలంబుననే నెఱవేఱఁగలదు. అందులకీసమయమున సమస్తశుభములు సమకూర్పఁజాలు నందిని దైవికముగ నిట కేతెంచుటయే నిదర్శనమని భావింపుము. ఈధేనువు నారాధించుక్రమమును బోధించెదను వినుము. ఈనందిని నిలిచినప్పుడు నీవును నిలువవలయు. ఇది విశ్రమించినపుడు నీవును విశ్రమింపవలయు. ఇదినీరు ద్రావునపుడు నీవును నీరు ద్రావవలయు. ఇది యెచటికిఁ బోయినను నీవచటికిఁ బోవలయును. ఈవిధముగ రాత్రిందివమును సేవలు చేయుచుఁ దత్ప్రసాదమును బడయుము. అని శాసించెను.

అంతట రాజదంపతులు గురుశాసనానుసారముగ యథావిధిని యతవ్రతులై శ్రద్ధాభక్తులతో నందినీధేనువు నహర్నిశమును సేవింపఁదొడఁగిరి. ఈవిధమున నేకవింశతిదినంబులు గడచెను. ఇరువదిరెండవదినంబున ప్రాతఃకాలమునందు దిలీపుఁడు ధనుర్ధరుఁడై యథాప్రకారము హోమధేనువువెంట హిమవత్పర్వతముదగ్గఱ కరిగెను. అంతలో నమ్మహీధరము గుహనుండి యొకక్రూరసింహము వచ్చి తటాలున నందినీధేనువు పైఁ బడెను. అప్పుడు దిలీపుఁ డతివేగముగాఁ గోదండమున

బాణము నెక్కుపెట్ట సన్నద్ధుఁడయి హస్తములు తనకు స్వాధీన
ములుగాక యట్లే చిత్రప్రతిమవలె నిలువఁబడి చేయునది లేక
రోషోద్రేకంబున మంత్రబద్ధమగు క్రూరసర్పము చందంబున
బుసఁగొట్టుచు మృగేంద్రమును జూచుచుండెను. అప్పు డ
స్సింహాస్యము మనుజవచనములతో రాజేంద్రా! నీవు శ్రమ
పడవలదు. నీ ప్రయత్నము వ్యర్థము. వాయుబలము వృక్షములను
పెకలింపఁగలదు గాని పర్వతము నున్మూలింపఁగలదా? నేను
కైలాసవాసియగు పరమేశ్వరుని కింకరుఁడను. నికుంభుని మిత్త్రుఁ
డను. నాపేరు కుంభోదరుఁడు. నీ మ్రోలఁ గనుపించు దేవదా
రువృక్షము పార్వతీపరమేశ్వరులకుఁ బుత్త్రునివంటిది. దీనియం
దొకనాఁడు వనగజంబులు దురద దీఱునట్లొడలు రుద్దుకొనఁగా
గొంతభాగము దీనిచర్మమూడిపోయినది. అందులకుఁ బార్వ
తీదేవి మిగుల దుఃఖించెను. అది మొదలు శివుండు నీవు
సింహాకారంబున నిటనుండి నీసమీపమునకు వచ్చెడి జంతు
వుల నాహారంబుగఁ జేసికొనుమని నా కాజ్ఞాపించెను. నే నిచ
టఁ దదాజ్ఞను బాలించుచుంటిని. నేఁడు నా పారణసమ
యమున కీయావు లభించినది. దీని నింక విడువను. భగ
వంతుని యాదేశము గావున నీ విది యొక పరాభవ
మని తలంపక తిరిగి వెడలిపొమ్ము. నీవు గురుభక్తిని
వెల్లడించితివి. శస్త్రసాధ్యము గాని కార్యము గానందున
ధనుర్ధరులకుఁ గీర్తి తగ్గదు. అని పలికెను. దిలీపుఁ డాకేసరి పలు

ను లాలించి భగవన్మహిమచేఁ గలిగిన యవమాన మవమానము గాదని తలంచియు భయవ్యాకులితనేత్రయగు నందినీధేనువు నీక్షించి దయార్ద్రహృదయుఁడై హర్యక్షమా! సకలచరాచరసృష్టిస్థితిలయహేతుభూతుఁడగు శంకరుని యాజ్ఞ నాకవశ్యము పూజనీయము. కాని యాహితాగ్నియగు మద్గురూత్తముని ధనంబు నష్టమగుట న్యాయ్యంబు గాదు. నాశరీరమును నీయాహారార్థము వినియోగించుకొని యీహోమధేనువును విడువుము. అని ప్రార్థించెను. సింహము పక్కున నవ్వి రాజేంద్రా! నీ వీభూమండలంబున కేకచ్ఛత్రాధిపతివి. నిండుజవ్వనంబున నుంటివి. నీదేహము బహుసుకోమలముగ నున్నది. నీవింకను మహాభోగము లనుభవింపఁదగినవాఁడవు. అల్పజంతువుకొఱ కిట్టి సమస్తమును విడువఁదగదు. నీ వొక్కఁడవు జీవించిన సకలప్రజలను గాపాడుదువు. నీవు జీవములు వాసినచో నీగో వొక్కటిమాత్రమే జీవింపఁగలదు గురువు కోపించునను భయము వలదు. వేలకొలఁదిగ నిట్టి యావుల నర్పించి యతని శాంతాత్మునిఁ గావింపవచ్చును. కావున నీదేహమును నీవు రక్షించుకొని రాజ్యమేలుకొనుము. పొమ్ము. అని పలికెను.

దిలీపుఁడు మృగరాజా! క్షత్త్రియుఁ డాపద్రక్షకుఁడను తుచ్ఛమగు స్వార్థమును కాసించి యార్తునిఁ గాపాడఁడేని వాని రాజ్యమును వానిసమస్తభోగములును వ్యర్థములు. వాఁడు

నిందాపాత్రుఁడు, నిందితుఁడగువాఁడు జీవింపనేల ? మఱియు ను ననంఖ్యాకములగు గోవులనిచ్చి గురువును దనుపవచ్చు నంటివి. అదియేమి ధర్మము ? ఒకప్రాణి మఱియొకప్రాణిచే హింసింపఁబడుచుండ క్షత్త్రియుఁడైనవాఁడు జీవచ్ఛవమువలెఁ జూచుచు నూరకుండఁ దగదు. కావున నాదేహమును నీ వాహారముగాఁ గొని హోమధేనువును విడిచి మద్గురూత్తముని హోమాదులకు లోపము లేకుండఁ జేయుము. నాధర్మమును రక్షింపుము. నాయశశ్శరీరమును గాపాడుము, అని పలువిధములఁ బలవంతపెట్టెను.

అప్పుడు సింహము నందినీధేనువును విడిచిపెట్టెను. దిలీపుఁడు ధనుర్బాణములు విడిచి మృగేంద్రమా ! నీవు నా యాచనను విఫలముఁజేయక యీ ధేనువును విడిచిపెట్టి నన్ను ననుగ్రహించితివి. నీవు చేసిన యుపకారమునకు నాదేహము నీకాహారముగ సమర్పించి నేను కృతకృత్యుఁడ నయ్యెదను. అని పలికి మహాధైర్యముతో సింహము ముందరికేగి నిలువఁబడెను. అంతలో వత్సా ! "నిలువుము నిలువుము" అను వాక్యము వినఁబడెను. తోడనే దిలీపునియెదుటనున్న సింహము దృశ్యమయ్యెను. దిలీపునకది యంతయు నత్యద్భుతంబుగఁదోఁచెను, అప్పుడు నందినీధేనువు మనుజభాషణములతో రాజేంద్రా ! నిన్నుఁ బరీక్షించుటకీ కథయంతయు నేనే కల్పించితిని. వసిష్ఠానుగ్రహముగల నన్నుఁ జెనకుటకు యమధర్మరాజున

కైనను శక్యముగాదు. నీగురుభక్తికిని నీదయాధర్మగుణంబు లకును మిగుల సంతసించితిని. నేను కేవలము క్షీరము మాత్ర మొసంగుదానను గాను. నిఖిలకామములు నీ డేర్పఁగలను. నీ వి ష్టమైన కావలసిన వరము కోరికొనుము. అని పలికెను. దిలీపుఁడా మాటలకు మహానందమునంది భక్తిభావమున దోసిలొగ్గి తల్లీ! నాకు వంశప్రవర్తకుఁడగు సత్పుత్త్రుని బ్రసాదింపుము. అని కోరెను. నందినీధేనువు "అట్లేయగుఁగాక" యని వాని ననుగ్ర హించెను. అంతట దిలీపుఁడు తనమనోరథము నెఱవేర్చికొని సంతోషముతో నాహోమధేనువును వెంటఁబెట్టుకొని వసి ష్ఠాశ్రమమునకు వచ్చి యాశ్రమవాసుల కందఱకును దద్వృ త్తాంతమును నివేదించెను. వారందఱును మిగుల నానందిం చిరి. పిదప రాజదంపతులు మునిదంపతులకుఁ బ్రదక్షిణప్రణా మము లాచరించి వారియాశీర్వాదములు వడసి తదాజ్ఞలఁ గైకొ ని ప్రయాణమై యయోధ్యానగరంబునకరిగి స్వాభీష్టము సిద్ధిం పఁగలదను విశ్వాసమునఁ బ్రముదితాంతరంగులై యథాప్రకా రము సర్వసౌఖ్యముల ననుభవించుచుండిరి.

## —: రఘుమహారాజచరిత్ర :—

అనంతరము సుదక్షిణాదేవి గర్భముఁదాల్చి పదియవ మాసంబునందొక్క శుభముహూర్తమునఁ బుత్త్రునిఁ గనెను. దిలీపునిపుత్త్రోదయోత్సవమున నగరమంతయు నలంకారముల

తోడను మంగళవాద్యములతోడను నుత్సవములతోడను నేత్ర పర్వముగ నుండెను. కులగురుండగు వసిష్ఠుఁ డరుదెంచి యకుమారునకు జాతకర్మాదిసంస్కారములు జరిగించెను. దిలీపుఁ డబ్బాలునకు "రఘువు" అను నామకరణముఁ జేసెను. రఘువు బాలచంద్రునికగిది దినదినాభివృద్ధిం గాంచుచుఁ గ్రమక్రమముగ ననేకవిద్యలు గడించి ధైర్యమునను శౌర్యమునను బుద్ధియందును వన్నె కెక్కెను. అతనికి యౌవన మంకురించి శరీర సౌష్ఠవము పెంపొందఁ జొచ్చెను. అతఁడు తలిదండ్రులయాజ్ఞాను సారముగ రూపవతులును యోగ్యలు నగు రాజకన్యల వివాహమాడెను. అతఁడు యౌవరాజ్యమును నభిషిక్తుఁడై యనేక రణరంగములలోఁ దండ్రినిమించి జయలక్ష్ములను జేపట్టెను. అతఁడు తనతండ్రిచేఁ దొంబదితొమ్మిది యశ్వమేధయాగములు చేయించి పరాక్రమవంతుఁ డను కీర్తి నార్జించెను.

అంతట దిలీపమహారాజు నూఱవయశ్వమేధయాగముఁ జేయ సంకల్పించి సకలమును సమకూర్చికొని తాను దీక్షితుఁడై యజ్ఞాశ్వమును విడిచి యథాపూర్వముగఁ గుమారుని హయరక్షకునిఁగా నియమించెను. పితృనియుక్తుఁడగు రఘురాజు సైన్యమును వెంటఁబెట్టుకొని యశ్వము వెంబడిఁ బోవుచుండెను. మార్గమధ్యమున దేవేంద్రుఁడు గూఢరూపముతో వచ్చి యధ్వరాశ్వమును హరించెను. అశ్వము కనఁబడకుండుటకు రఘురాజచ్చెరువొందుచుఁ గ్రమక్రమమున వ్యాకులచిత్తుఁడు గాఁజొ

స్పృహ. అంతలోఁ దన ప్రసాదముచే జనించినవాఁ డను వాత్స ల్యమున నదిని ననుగ్రహింపఁ దలఁచి నందినీధేను వచ్చటికి వచ్చి మూత్రము విడిచెను. రఘురాజు పవిత్రమగు గోమూత్రము తనకన్నులకద్దుకొనియెను. అక్కడను సహస్రాక్షుఁడగు దేవేంద్రుఁడు అతనికన్నుల కగపడెను. రఘురాజు దేవేంద్రునిఁ జూచి మహేంద్రా! నీవు శతక్రతువు లొనరించియుంటివి. నేఁడు క్రతువిఘ్నము సేయఁగడంగుట నీకు ధర్మమా? యజ్ఞవిఘ్నకారకులగు దురాత్ములను దివ్యచక్షువుచేఁ గనుగొని శిక్షింపఁదగిన నీవే యిట్లు యజ్ఞవిఘ్నమునకుఁ బూనుకొనిన లోకమున నింక శ్రౌతకర్మములు ఫలింపక నిలిచియుండఁ గలవా? మఖసాధనమగు హయమును వెంటనే విడువుము. మలినులపద్ధతి నవలంబింపకుము. అని గంభీరముగాఁ బలికెను.

అంత దేవేంద్రుఁ డచ్చట నిలిచి రఘురాజా! నీపలికిన పలుకులు యథార్థములు. యశోధనులగువారు తమ యశమునకు హాని సంభవించునపు డెట్టికార్యమేని చేసి కీర్తి నిలిపికొన వలసియున్నది. నాకీర్తి నపహరించుటకు నూఱవ యశ్వమేధము నారంభించిన నీతండ్రి కార్యమునకు విఘ్నము నాపాదింపక పనికిమాలినవాఁడువలె నేనూరక చూచుచుండుట యుక్తమని నీకుఁ దోఁచెనా? లోకములలో హరిదప్పఁ బురుషోత్తమశబ్దమున కర్హుఁడగువాఁడు మఱియొకఁడు లేడు. మహేశ్వరశబ్దమున కర్హుఁడగువాఁడు త్ర్యంబకుఁడు దక్క మఱియొ

కండు లేడు. అట్లే శతక్రతుశబ్దమున కర్హుఁడగువాఁడు నా కంటె మఱియొకఁడు లేడు. నీవు నన్ను వెంటనంటి సగరపుత్త్రులు కపిలమహాముని కోపాగ్నిలో నాహుతియైనట్లు నాశ ప్రతాపములకు గుఱిగాకుము. వెడలిపొమ్ము అని భీషణముగఁ బలికెను.

రఘురాజు నవ్వి యమరేంద్రా! నీకట్టి యభిప్రాయమున్నచో నన్ను జయించి తురగమును గొని పొమ్ము. లేదేని నిన్నిక్కడనుండి యొకయడుగుఁగూడఁ గదలనీయను. చోరుఁడువలె యజ్ఞాశ్వమును దొంగిలించుకొని పోవుట మహావీరకృత్యమని తలంచితివి కాబోలు నిలువుము. అని పలికి ధనువున శరమును సంధించెను. దేవేంద్రుఁ డతనిధైర్యమునకు లోలోన నచ్చెరువొందుచుఁ దానుగూడఁ బ్రతిశరము సంధానించెను. వారిరువురకును ఘోరమగు పోరు జరిగెను. ఇంద్రుఁ డాతని శౌర్యమునకు నివ్వెఱపడి వత్సా! నీపరాక్రమమునకు మెచ్చితిని. వరమడుగు నిచ్చెదను. అనెను అప్పుడు రఘురాజు దేవా! నీ వీసవనాశ్వమును విడువుము. లేనిచో నశ్వమేధయాగ ఫలము నాతండ్రికొసంగుము. అని కోరెను. దేవేంద్రుఁడు వాజిమేధఫల మతనితండ్రికిఁ గలుగునట్లు ప్రసాదించి యంతర్హితుండయ్యెను. రఘురాజు తండ్రియొద్దకుఁ బోయి తద్వృత్తాంతమంతయును నివేదించెను. దిలీపుఁడు సంతోషించి కుమారునకుఁ బట్టాభిషేక మహోత్సవ మొనరించి తాను భార్య

తోఁగూడ సంప్రదాయప్రాప్తమగు వానప్రస్థాశ్రమధర్మము నెఱవేర్చుటకు వనంబున కరిగెను.

సకలసద్గుణసంపన్నుఁడగు రఘుమహారాజు నిరుపమాన ప్రతిభావిశేషముతో రాజ్యమును బరిపాలించుచుఁ బ్రజాను రంజనమున రాజశబ్దము సార్థకము చేయుచు క్షత్రియులోచితంబులగు దండయాత్రలు సలిపి నలుదెసలయందుండు వీరాగ్రేసరులజయించి వారిమెప్పువడసి యచ్చటచ్చట జయస్తంభంబులు పాతించి పిదప విశ్వజిన్మహాయాగము చేసి యందు తనసర్వస్వమును భూరిదక్షిణలకుఁగా వినియోగించి రిక్తుఁడై యుండెను.

అప్పుడు వరతంతుమహామునిశిష్యుఁడు కౌత్సుఁడను బ్రహ్మచారి యతనికడ కరుదెంచి తదాతిథ్యమునందుకొని రాజేంద్రా! నేను పదునాలుగువిద్యలను సంపూర్ణముగానభ్యసించితిని. ఇంక గురుదక్షిణనొసంగి గృహమున కరుగవలయును గావున గురుదక్షిణకొఱకుఁ బదునాలుగుకోట్ల రూప్యములు కావలసి మహాదాతవను ప్రసిద్ధివడసియుండిన నీకడకు వచ్చితిని. అని చెప్పెను. రఘుమహారాజకించనుఁడయ్యును దన నోట నాస్తియను శబ్దము రానీయక యమ్మహర్షి నాదరించి స్వామీ! రెండుదినములు మీరిట నుండుఁడు. అని పలికి తాను సైన్యముతోఁగూడి ధననిధియగు కుబేరునిపైకి దాడి వెడలెను. కుబేరుఁ డావార్తవిని భయపడి సూర్యోదయమగు నపు

ర్ణవర్ణమును గుఱించెను. రఘుమహారాజా ద్రవిణమంత యుఁ గౌత్సునకర్పించి యతని సంతృప్తాత్మునిఁ గావించెను. అప్పుడతఁడు మహారాజా! గుణవంతుఁడగు నీతండ్రి కనా రూపగుణాఢ్యవు నీవు జన్మించినట్లు నీవలె సద్గుణ సంపన్నుఁడగు పుత్రుఁడు నీకుదయించుఁ గాక యని దీవించి గురుని యాశ్రమ మున కరిగెను.

—: అజమహారాజచరిత్ర :—

అంతట అచిరకాలంబుననే యొక్క శుభలగ్నంబున రఘుమహారాజునకుఁ బుత్త్రుఁడు పుట్టెను. అతనిపేరు అజుఁడు. అక్కుమారుఁడు దినదినాభివృద్ధింగాంచుచు సకలవిద్యలలోఁ బ్రావీణ్యము వడసి ధైర్యశౌర్యాదిగుణములలోఁ దండ్రితో సమానుఁడయ్యెను. రఘుమహీపాలుఁడు కుమారునియౌవన సుందరంబగు దేహంబును సద్గుణంబులను బుద్ధివిశేషమును బరిశీలించి యతని యౌవరాజ్యమున నభిషిక్తుం జేసెను. ఒకానొక సమయమున క్రథకైశికదేశాధిపతియగు భోజరాజు తన చెల్లెలగు నిందుమతికి వివాహముగావింప స్వయంవరము చాటించి రఘుమహారాజుదగ్గఱకొక దూతను బంపెను. రఘుభూప రుఁడు తత్సంబంధము యోగ్యమైనదని నిశ్చయించుకొని కొంత సైన్యముతోఁ దనకుమారుని నాస్వయంవరమునకుఁ బొమ్మని యాజ్ఞాపించెను. అజుఁడు తండ్రియాజ్ఞానుసారము స్వయంవర

మునకరుగుచుండ మార్గమధ్యమునం దొక మదపుటేనుఁగు
వచ్చి యతని సైన్యమును జీకాకుచేయఁ దొడంగెను. అప్పు డజుఁ
డొక యినుపగుదియతో నక్కుంజరము కుంభస్థలంబును బగు
లఁగొట్టెను. అంత నావనగజము స్వరూపమును విడిచి దేవ
రూపమును దాల్చి యజునితో నిట్లనియె కుమారా! నేను
గంధర్వరాజతనయుండను. నాపేరు ప్రియంవదుఁడు నాకు
మతంగముని శాపంబున వనగజరూపము ప్రాప్తించినది.
నీవలన నాకిప్పుడు శాపమోక్షము గలిగినది. నీయుపకారము
నకుఁ బ్రత్యుపకారముగా సమ్మోహనాస్త్ర ముపదేశించెదను
గైకొనుము. అని యజున కాయస్త్రము నుపదేశించి యతఁడు
గంధర్వలోకమున కరిగెను.

అంతట నజుఁడు దైవికముగ నస్త్రము లభించినందుల
కానందమొంది యచ్చటనుండి ప్రయాణమై భోజునినగరము
నకు వచ్చి యచ్చట వారిసత్కారములఁ బడసి స్వయంవర
మండపమునకుఁ జేరి యందొక పీఠము నలంకరించెను. అచ్చట
నానాదేశములనుండి వచ్చిన రాజన్యు లాస్థానము నధిష్ఠించి
యుండిరి. అప్రదేశము దేవసభవలె విరాజిల్లుచుండెను. అప్పుడు
సర్వాంగసుందరి యగు "ఇందుమతి" భూషణాంబరాలంకృతయై
సఖీసమేతముగ స్వయంవరభవనమునకు వచ్చి చెలికత్తియవల
న నాయారాజపుత్రుల రూపగుణపరాక్రమైశ్వర్యాదియోగ్య
తల నాకర్ణించి యంగవంగకళింగమగధావంతిపాండుదేశాది

రాజన్యుల వరియింప నిష్టపడక రఘునందనుఁ డగు నజునిఁ జూచినతోడనే తద్దూతసంపద కబ్బురమంది పుష్పహారము నాతనిమెడలో వైచెను. పిదప భోజరాజు మహానందమున మంగళవాద్యాది సకలవైభవంబులతో వారిరువురకును యథావిధిని పాణిగ్రహణమహోత్సవంబు జరిగించెను. ఆ నవీనదంపతులు రతీమన్మథులవలె నల్లరకుచు గన్నులపండువుగ నుండిరి. అంతట నజుఁడు భోజుని యనుమతింగొని భార్యాసహితుఁడై బంధుగణంబులను సేనను వెంటఁబెట్టుకొని ప్రయాణమై నిజపట్టనంబునకుఁ బోవుచుండ మార్గమధ్యమున స్వయంవరార్థమరుదెంచిన రాజన్యులు ఇందుమతి యజుని వరించి వారిని నిరాకరించినందున నసూయాగ్రస్తులై యజునిజయించి యిందుమతిం గొనిపోవలయునను దురభిప్రాయంబున నజుని నడ్డగించి యందఱు నొక్కుమ్మడి నతనిపైఁ గవిసిరి. అంత రాజమండలమునకును నజునకును ఘోరయుద్ధము జరిగెను. అజుఁడు వారొక్కరుఁడైనను బహుధైర్యసాహసములతోఁ బోరాడి యా రాజన్యుల నోడించి జయముఁగొని తన నగరంబును జేరి తండ్రి కావృత్తాంతమంతయుఁ దెలిపెను.

రఘుమహారాజు కుమారుని శక్తివిశేషమునకు సంతసించి యతనికిఁ బట్టాభిషేకమహోత్సవము నలిపి కొంతకాలమాతని పరిపాలనావిధానమును గాంచి యానందించి పిదప యోగమున దేహము విడిచెను. అజమహారాజు రాజ్యపాలన

మునఁ దండ్రిని మఱపించుచుఁ బత్నితోఁగూడి యనేకధర్మ కార్యములు చేయుచుండెను.

—: దశరథమహారాజచరిత్ర :—

కాలక్రమంబున నజునకొక కొమరుండు గలిగెను. అతని పేరు దశరథుఁడు. అతఁడు కులక్రమాగతములగు విద్యల నన్నింటిని గఱచి క్రమక్రమముగఁ బ్రజారక్షణదక్షత నార్జించెను. అప్పు డజమహారాజు రాజ్యభారమునంతయు దశరథుని యందుంచి యొకనాఁడు తనప్రియురాలగు నిందుమతితోడ నుద్యానవనమున కరిగి యచట విహరించుచుండెను. అప్పుడు నారదముని గోకర్ణక్షేత్రస్థుఁడగు శివునిఁ బూజించుటకు నభోమార్గమునఁ బోవుచుండఁగా నాతని వీణాగ్రమున వ్రేలాడు పుష్పమాల యిందుమతిపైఁ బడెను. తోడనే యామె స్మృతి దప్పి ప్రాణములు విడిచెను. పిదప నజమహారాజతికష్టంబున భవనమునకరిగి ప్రియురాలివియోగశోకసంతప్తుఁడై యుండెను. ఇట్లుండ నొకనాఁడు వసిష్ఠుని శిష్యుఁ డొక డజమహీపతికడకు వచ్చి మహారాజా! నేను వసిష్ఠమహర్షి శిష్యుఁడను. నీవు భార్యావియోగమున మిక్కిలి దుఃఖించుచున్నావని తెలిసి మా గురువు నీకొక సందేశ మంపెను వినుము. పూర్వము తృణబిందుఁడను మునీంద్రుఁడు ఘోరతపం బొనరించుచుండ నింద్రుఁడు భయపడి హరిణియను నప్సరస నాతని సమాధిని

చెఱుపుటకుఁ బంపెను. అంత నాహారిణి తనశృంగారచేష్టల నతని యోగభ్రష్టునిఁజేయ యత్నించెను. అప్పుడు తృణబిందుఁడు క్రుద్ధుఁడై నీవు మనుష్యస్త్రీవై పుట్టుదువు గాక యని శపించెను. ఆహారిణియే యిందుమతియై పుట్టి నీకు భార్యయయ్యెను. తృణబిందునిశాపము దేవపుష్పస్పర్శావసానమై యున్నది. కావుననే యాకని జరిగినది. ఇది గ్రహించి నీవు విచారము విడువుము. అని పలికి వెడలిపోయెను. అజమహీపాలుఁడు వ్యసనము నుపశమింపఁజేసికొని తుదకు గంగాసరయూసంగమప్రదేశమున శరీరమును ద్యజించెను.

పిమ్మట దశరథుఁడు వంశక్రమాగతంబగు భూమండలమునంతయు నిరంకుశముగ నేలుచుఁ బ్రజల కనేకసౌఖ్యములు గూర్చుచుండెను. కోసలమిథిలకేకయదేశాధిపతులు దశరథమహారాజునకుఁ దమతమకొమార్తెలనిచ్చి వివాహముగావించిరి. దశరథుఁడు కౌసల్య సుమిత్ర కైకేయి యను మువ్వురుభార్యలయందును సమానానురాగముతో మెలఁగుచు నఖిలసౌఖ్యంబుల ననుభవించుచుండెను. అతఁ డనేకపర్యాయములు దండయాత్రలు సలిపి భూపాలురనందఱను సామంతప్రభువులఁగ నొనర్చుకొని దశదిశలయందును నప్రతిహతరథుఁడై తననామమును సార్థముగఁ జేసికొనెను. అతఁడొకసారి మృగయావినోదార్థ మొకయడవికేగి క్రూరమృగంబుల వేఁటాడి యారాత్రి యచటనే కడపి యుషఃకాలంబునలేచి తమసానదీతీరమందుఁ

క్రూరజంతువులఁ దునుమాడుటకై వేచియుండెను. అప్పుడొక మునికుమారుఁ డానదిలోఁ గుండతో నీరు ముంచుకొనుచుండ బుడబుడయను ధ్వని వెడలెను. దశరథుఁ డాచప్పుడు విని యడవియేనుఁగు తొండముతో నీరు ద్రావుచున్న దను భావమున శబ్దానుసార మెఱిగి లక్ష్యమును భేదించు శబ్దభేది యను శరంబును బ్రయోగించెను. ఆ బాణ మమ్మునికుమారునిపైఁ బడెను. అతఁడు హా తాతా! యని యేడ్చి నేలఁ గూలెను. దశరథుఁ డాయార్తస్వరము విని అయ్యో, అజ్ఞానమున నెంత పాపకార్యము చేసితిని? యని చింతాభరమునొందుచు నచటి కరిగి మునికుమారుని వృద్ధులగు నతని తల్లిదండ్రులకడకుఁ దీసికొనిపోయి వారికిఁ దద్వృత్తాంతమంతయును విన్నవించెను. వృద్ధదంపతులు దుఃఖాతిశయమున "రాజా! నీవు మాకీపుత్రశోకము గలిగించినందున నీవు మావలె ముసలితనములోఁ బుత్రశోకమున మరణింతువుగాక" యని శపించిరి. దశరథుఁడు సంతానము లేక కడువంతల పాలగుచున్న నాకీవృద్ధదంపతుల శాపము పుత్రోదయకాంక్షను గలుగఁజేసి యొకవిధముగ మేలు గలుగఁజేయుచున్నదని భావించుకొను చయోధ్యానగరంబునకు వచ్చెను.

దశరథుఁడు బహుకాలము గడచియుఁ దనకు సంతానము గలుగకుండుటకుఁ జింతించి గురువుల యుపదేశానుసారముగ సంతానముకొఱకుఁ బుత్రకామేష్టియాగము సలుపుటకు

సంకల్పించి సకలవస్తుసంభారములను సమకూర్చుకొని మహర్షులను మహీపాలురను బంధువులను నాహ్వానించి వారందఱు సముఖమున ఋష్యశృంగాది మహర్షులు ఋత్విజులుగనుండఁ దాను దీక్షితుఁడై యాగమును జేయనారంభించెను. ఆసమయమున రావణుం డను రాక్షసేంద్రునివలన ఘోరబాధ లనుభవించుచుండిన యింద్రాదిదేవత లాపద్రక్షకుఁ డగు విష్ణుమూర్తి యొద్దకుఁ బోయి యానేకవిధ స్తోత్రములు చేసిరి. అప్పుండరీకాక్షుండు దేవతలు వచ్చినకార్యం బెఱింగి విబుధులారా! మీ యభిప్రాయము నే నెఱుంగుదును. రావణాసురుఁడు తీవ్రతపం బొనరించి బ్రహ్మదేవుని సంతసింపఁజేసి దేవదానవాదులవలనఁ దనకుఁ జావులేకుండునట్లు వరములు వడసెను. కాని యతఁడు మానవులను లెక్కింపక వారిచే మరణింపకుండునట్లు వరముఁ గోరుకొనలేదు. కావున నిపుడు మానవుండగు దశరథమహారాజు పుత్త్రకామేష్టియాగము సలుపుచున్నాఁడు. నే నాతనికిఁ బుత్త్రుండనై పుట్టి రావణాసురుని సంహరించి మీవిపత్తులు దొలఁగింతును. మీరు మీమీయంశములతో వానరులై జనియించి నాకు సాహాయ్య మొనరింపుఁడు పొండు. అని పలికెను. దేవత లాతనియనుగ్రహపూర్వకవచనములవలన సత్వరము తమ కష్టము లీడేఱిన ట్లానందించి తమతమ నిలయములకుఁ జనిరి.

అంతట దశరథుని పుత్త్రకామేష్టియాగము పరిపూర్ణము గావచ్చెను. ఆసమయమున అగ్నికుండములోనుండి యొకదివ్య

పురుషుఁడు తెచ్చియిచ్చి పాయసాన్నముతో నిండియుండిన యొక
స్వర్ణకలశమును దశరథమహారాజున కొసంగి యంతర్హితుం
డాయెను. దశరథుఁడా పాయసాన్నము దేవతాప్రసాదమని
తెలిసికొని మహానందముఁజెంది దానిని రెండుభాగములుచేసి
కౌసల్యాకైకలకుఁ జెఱియొక భాగము నిచ్చెను. వా రిరువురును
దమతమప్రత్యేకభాగములను రెండురెండు భాగములుగ విభజిం
చికొని తోడికోడలగు సుమిత్రకుఁ జెఱియొక భాగము నొసంగిరి.
పిదప ముగ్గురును వారివారిపాయసాన్నభాగములను భుజించిరి.
యాగార్థ మరుదెంచిన మహర్షులును భూపాలురును బంధుప్రజలును
దశరథుని సత్కారములకు సంతుష్టచిత్తులై యతనియనుమతి
వడసి తమతమనెలవుల కరిగిరి.

## —: శ్రీరామచరిత్ర :—

అంతట దశరథుని ధర్మపత్నులు ముగ్గురును గర్భిణులైరి.
పదునొకొండుమాసములు గడచెను. చంద్రుండుపునర్వసునక్షత్రమునఁ
బంచగ్రహములు నుచ్చస్థానములం దుండ శుభలగ్నములందు
కౌసల్యకు శ్రీరాముఁడు కైకకు భరతుఁడు సుమిత్రకు లక్ష్మణ
శత్రుఘ్నులు అను నలుగురు కొడుకులు గలిగిరి. వారు లోక
సంరక్షణార్థ మవతరించిన భగవదంశములగుటచే వారిజననకాల
మున నాకసమునుండి పుష్పవర్షములుగురిసెను. దేవదుందుభులు

ప్రోఁగెను. దశరథుఁడు పుత్రోదయమునకు మిగుల సంతో షించి వారికి జాతకర్మాదిసంస్కారములు నిర్వర్తింపఁ జేసెను. వారు నానాఁటికి శుక్లపక్షచంద్రులవలె నభివృద్ధినందుచు ననేక విద్యావిశేషములలో నారితేఱిరి. అట్లుండ నొకనాఁడు విశ్వా మిత్రుఁ డను నొకమునీంద్రుఁడు దశరథునికడకు వచ్చి యతని వలనఁ బూజలందికొని రాజా! నేనొకయజ్ఞము సేయుటకుఁదలపెట్టి తిని దాని కంతరాయములు రాకుండఁ గాపాడుటకు నీయుగ్ర సుతుండగు శ్రీరాముఁడు సమర్థుఁడు కావున నతని యాగరక్ష ణమునకుఁ బంపవలయునని కోరుటకు నేను నీకడకు వచ్చితిని. అని పలికెను.

దశరథుఁడు రామలక్ష్మణుల నిరువురను మునీంద్రుని వెంటఁబోవ నాజ్ఞాపించెను. కౌశికుఁడు రామలక్ష్మణులను వెంటఁబెట్టుకొని బయలుదేఱి మార్గమధ్యమున వారికి క్షుత్పిపా సల బాధ లేకుండుటకై "బల" "అతిబల" అను మంత్రములు నుపదేశించి ప్రాచీనపత్పురుషుల చరిత్రములు చెప్పుచుఁ దోడ్కొని పోవుచుండెను. దారిలో భయంకరాకారయగు తాటకయను రాక్షసి వారి నడ్డగించెను. అప్పుడు విశ్వామి త్రుని యానతిచే శ్రీరాముఁ డొక్కబాణమున నా తాటకను వధించెను. కౌశికుఁడు రాముని పరాక్రమమునకు మెచ్చికొని యతని కనేకదివ్యాస్త్రముల నుపదేశించెను. పిదప వారు యథాప్రకారము ప్రయాణముజేసి వామనాశ్రమము నిూఁ

ముగఁ గౌశికమునీంద్రుని సిద్ధాశ్రమమునకుఁ జేర్చి. విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులను యాగరక్షణార్థము నియమించి తాను దీక్షితుఁడై యథావిధిని యాగము సలుప నారంభించెను. అప్పుడు క్రతువును ధ్వంసము చేయుటకు యథాపూర్వముగ రాక్షసబలంబు లాకసము నావరించెను. ధీరుఁడగు శ్రీరాముఁ డాసంరక్షమును గ్రహించి యసురబలంబులకు నాయకులగు సుబాహుమారీచులకై రెండుబాణములఁ బ్రయోగించి వానిలో నొకబాణముచే సుబాహుని దెగటార్చి రెండవబాణముచే మారీచుని సముద్రములోఁ బడఁ ద్రోచెను. అధ్వరమున కంతరాయములు దొలఁగెను. యాగముగూడ ముగిసెను. మహర్షులందఱును రాముని పరాక్రమగుణంబులకు మిగుల సంతసించిరి.

అంతట మిథిలాధిపతి యగు జనకుఁడు తా నొకజన్నము చేయఁబోవుచున్నానని విశ్వామిత్రున కాహ్వాన మంపెను. కౌశికుఁడు దశరథనందనులను వెంటఁబెట్టుకొని మిథిలానగరమునకు కరుగుచు మార్గమధ్యమున నున్న గౌతమాశ్రమము నకుఁ జేరెను. అచటఁ దనభర్త యగు గౌతమమహర్షి శాపంబున శిలయై పడియుండిన యహల్య శ్రీరాముని పాదధూళి సోఁకినతోడనే శాపవిముక్తిని జెంది స్వస్వరూపముఁ దాల్చి శ్రీరామచంద్రుని నుతించి తనభర్తకడ కరిగెను. పిదప వారు మువ్వురును మిథిలకుఁ బోయి జనకుని యాగశాలకుఁ జేరి

వారి సత్కారములం బడసిరి. జనకుఁడు యాగము ముగిసినపి మ్మట గాధికినందనుఁడు జనకునకు శ్రీరాముని జూపించి, రాజా! ఇతఁడు దశరథుని పుత్త్రుఁడు. నీవు కన్యాశుల్కముగా నుంచిన శివధనస్సును జూడ నిచ్ఛగించుచున్నాఁడు. అని పలికెను. జనకుఁడు రాముని జూచి కుమారా! నీవు శివధనుస్సును జూచి యేమి చేయఁగలవు? ఇంతకుఁ బూర్వ మెందఱో వీరాధివీరులు వచ్చి యాకోదండమును జక్కఁగఁ బట్టుటకైనను శక్తులు గారైరి. అని పలుకుచుండఁ గౌశికుఁడు వారించి రాజా! మాటలతోఁ బనియేమి? క్రియాపర్యవసానమున నీవే సారాసారములు గ్రహింతువు. ధనువుఁ దెప్పింపుము. అనను. వెంటనే మిథిలాధిపతి సభామధ్యంబునకు ధనువుఁ దెప్పించెను. పిదప శ్రీరామచంద్రుఁడు శివకార్ముకంబు నెక్కుపెట్టి గట్టిగనాకర్షించుచుండ నది విఱిగెను.

అది చూచి సదస్యు లెల్లరును నత్యాశ్చర్యభరితులైరి. జనకచక్రవర్తి సంతుష్టాంతరంగుఁడై దశరథమహారాజునకు శుభవార్త నందఁజేసెను. దశరథుఁడు సంతోషముతోఁ బుత్త్రమిత్రకళత్ర పరివారసహితుఁడై మిథిలాపత్తనంబున కరుదెంచెను. జనకుఁడు వారందఱ కుచితోపచారములు గావించి యొకశుభలగ్నంబునఁ దనపెద్దకుమార్తెయగు సీతను శ్రీరామునకును జిన్నకుమార్తె యగు నూర్మిళను లక్ష్మణునకును దనతమ్ముని పుత్త్రికలగు మాండవీశ్రుతకీర్తులను భరత శత్రు

ఘ్నులకును నిచ్చి పాణిగ్రహణ మహోత్సవంబులు మంగళ వాద్యాది వైభవంబులతో జరిగించెను. పిమ్మట దశరథుఁడు నలుగురు కుమారులను గోడండ్రను బంధుమిత్రపరివారంబును వెంటఁబెట్టుకొని జనకుఁ డొసంగిన యరణంబులను గ్రహించి నిజపురంబునకుఁ బ్రయాణమై పోవుచుండెను. మార్గమధ్యమున బరశురాముఁడు తనగురువగు శివునివిల్లు విఱిచెనని రోషమున శ్రీరాము నడ్డగించెను. శ్రీరాముఁ డాతనిపై బాణము నెక్కు పెట్టి బ్రహ్మహత్యాప జంకి తన బాణము నతని ధనుఃపుటుచేత వాని సుకృతసోపానములు వ్యర్థము జేసి నిర్మూలము గావించెను. పరశురా ముఁడు శ్రీరాముని తేజమునకోడి వనమున కేగెను. పిదప వారం దఱుచు నయోధ్యానగరమున కరిగి యందు సుఖవంతులై యుండిరి.

కాలక్రమమున దశరథుఁడు వృద్ధుడై శ్రీరామునకు పట్టాభిషేకము సలుపుటకు నిశ్చయించి తత్ప్రయత్నములు చేయుచుండెను. అప్పుడొకనాఁడు కైకేయి దశరథుని ప్రాల నూరక యేడ్వఁజొచ్చెను. దశరథుఁ డామెను మాఱడించి నీమ నోరథం బేదియో తెలుపుము. అని పలికెను. కైక రాజా! పూర్వమొకసమయమున నీవు నాకు రెండువరములు లిచ్చియుంటివి. ఆవరము లిపుడు కోరుకొందును. నీవు నెఱవేర్పక తప్పదు. తప్పినచో నీ వసత్యవాది వగుదువు అని పలికి శ్రీరాముని పదు నాలుగేండ్లరణ్యవాసము చేయించుట యొకవరముగాను, భర

కుని రాజ్యమునఁ బట్టాభిషిక్తునిఁ జేయుట రెండవ వరముగాను గోరెను. ఆమాటలు దశరథుని చెవులఁ బిడుగులవలెఁ గలంచెను. కానిసత్యప్రతిజ్ఞుం డగుటవలన శ్రీరాముని బిలిచి నీవు పదునాల్గువర్షంబు లరణ్యవాసము చేయవలయునని యాజ్ఞాపించెను. ఆవార్తవిని పురజనులెల్లరును మితిలేని దుఃఖమునొందిరి. శ్రీరాముఁడు పితాజ్ఞను శిరంబునఁ దాల్చి నారచీరలు ధరించి సీతాలక్ష్మణులను వెంటఁ బెట్టుకొని దండకారణ్యమున కరిగెను.

అంతటఁ గొన్నిదినంబులకు దశరథుఁడు పుత్త్రవియోగదుఃఖంబున మరణించెను. అప్పుడు మాతామహులగృహంబున నున్న భరతుఁడు పితృమరణవార్తను విని సరభసంబున నయోధ్యకువచ్చి పితృమరణమునకును భ్రాతృవనవాసమునకును దల్లికుటిలబుద్ధికిని మిగుల వగచి కొందఱుభటులతో శ్రీరాముని వెదకికొనుచుఁ జిత్రకూటవనమునకుఁ జేరి యచట నగ్రజుని గాంచి సాష్టాంగప్రణామ మొనరించి తండ్రిమరణమును దెలిపి రాజ్యమును నీవ పాలింపవలయు నని పలువిధములఁ బ్రార్థించెను. శ్రీరాముఁడు పితాజ్ఞాపరిపాలనపరాయణుఁ డగుటవలనఁ దమ్మునిపలుకుల కియ్యకొనఁడయ్యె. భరతుఁడు చేయునది లేక భక్తివిశేషమున నగ్రజుని యనుమతి వడసి యతని పాదుకలు దీసికొని శ్రీరాముఁడులేని యయోధ్యకుఁ బోనొల్లక తత్సమీపమున నుండు నందిగ్రామమున

నివసించి రాజస్థానమునఁ దత్పాదుకలు చేర్చి వాని కభిషేకోత్సవము సల్పి పూజించుచు రాజ్య మేలుచుండెను

అది యట్లుండఁ జిత్రకూటవనమునఁ దనయాశ్రమమందు శ్రీరాముఁ డొకనాఁడు సీతతొడపై శిరముంచి పరుండి నిద్రించుచుండెను అప్పుడు కాకరూపుఁ డగు నింద్రసుతుఁ డచటికి వచ్చి సీతాదేవియురఃప్రదేశమున ముక్కుతోఁ బొడిచెను. సీత జడిసి రాముని మేల్కొలిపెను. రాముఁడు కోపముతో నొకతృణమును బ్రహ్మాస్త్రముగా మంత్రించి యాకాకముపై విడిచెను ఆయస్త్రము వానిని ముల్లోకములు ద్రిప్పి తుద కొకకన్నుఁ బోఁగొట్టి వదలిపెట్టెను. పిదప శ్రీ రాముఁడు చిత్రకూటమున నున్నచో భరతుఁడు మరల రాఁగలడని సంశయించి సీతాలక్ష్మణులతోఁ గూడ నచ్చోటు విడిచి యతిథులు నివసించుటకు యోగ్యములగు ఋష్యాశ్రమంబుల మీఁదుగఁ గ్రమక్రమముగ దక్షిణదిశకుఁ బోవుచుండెను. మార్గమధ్యమున చంద్రుని రాహు గ్రహ మడ్డగించినట్లు శ్రీరామచంద్రుని విరాధుఁ డను రాక్షసుఁ డడ్డగించి సీతను హరించెను. అంత రామలక్ష్మణులు క్రుద్ధులై యా రాక్షసుని సంహరించి సీతను గైకొని యగస్త్యాశ్రమమునకరిగి యతనియనుగ్రహంబు వడసి యతని శాసనానుసారముగ పంచవటియం దొకపర్ణశాలను నిర్మించుకొని యందు నివసించుచుండిరి.

అంతట నొకసమయమున గ్రీష్మతాపమున కోర్వఁజాలని భుజంగి చందనవృక్షమును జేరునట్లు రావణాసురుని చెల్లె

లగు శూర్పణఖ మనోభవతాపమున కోర్వఁజాలక శ్రీరా ముని యొద్దకుఁ జేరి యతనికిఁ దన కులమును స్థలమును దెలిపి నన్ను వరింపుమని కోరెను. శ్రీరాముఁడు నాకు భార్య గలదు. నాతమ్ముని వరింపుమని పలికెను. శూర్పణఖ లక్ష్మ ణునికడ కరిగి తనకోరికఁ దెలిపి యతఁ డంగీకరింపనందున తిరిగి రామునికడకు వచ్చెను. అప్పు డారాక్షసిచేష్టితము చూచి సీత నవ్వెను. శూర్పణఖ కోపముతో కన్నులెఱ్ఱఁ జేసి సీతను జూచి నీనవ్వేలకుఁ దగినఫల మల్పకాలములోనే యనుభ వింపఁగలవు. నీవు నాకొనర్చిన యవమానము లేడి పెద్దపులి కొనర్చిన తిరస్కారమువంటి దని తెలియుము. అని పలికి కఱ కుచూపులతో నామెను జూచుచుండెను. అంత నీప్రసంగమం తయు వినుచుండిన లక్ష్మణుఁ డాటునుండి కత్తిదూసి శూర్పణఖ ముక్కును జెవులను ఖండించెను. ఆరాక్షసి రోదనముఁ జేయుచు జనస్థానమున కరిగి ఖరదూషణత్రిశిరః ప్రముఖులగు రాక్షసనాయకులకుఁ దనయవమానమును దెలిపెను. అంతట వారు మండిపడి సైన్యముతోఁ గూడి శూర్పణఖను ముందుం చుకొని రామునిపైకి దండెత్తిరి. శ్రీరాముఁడు తనతమ్ముని సీతారక్షణార్థము నియోగించి తానొక్కం డారక్కసిమూఁకల నెల్ల నుక్కడంచెను.

పిమ్మట శూర్పణఖ తనయన్నయగు రావణాసురుని యొద్ద కరిగి జరిగిన వృత్తాంతమునంతయుఁ జెప్పెను. రావ

రావణుఁడు, మారీచుని సాహాయ్యమున రామలక్ష్మణులను వంచించి సీత నపహరించుకొని తిరిగి వచ్చుచుండెను. అప్పుడు జటాయువు పక్షీంద్రుఁడు రావణు నడ్డగించి వానితో యుద్ధముఁ జేసెను. రావణుఁడు జటాయువు రెక్కలూడఁగొట్టి సీతను దీసికొనిపోయి తనలంకలో నుంచెను. పిదప రామలక్ష్మణులు సీతను గానక శోకాకులితమనస్కులై యామెను వెదకుచుఁ గంఠగతప్రాణుఁడై రెక్కలు తెగిపడియుండిన జటాయువును సమీపించిరి. జటాయువు గద్గదకంఠస్వరములతో రావణాసురుఁడు జానకి నపహరించుట మొదలగు యుద్ధవృత్తాంతము రాజకుమారులకు జెప్పి ప్రాణములు విడిచెను. ఆ రాజకుమారులు పక్షీంద్రునకు దహనసంస్కారములు సలిపి మరల యథాప్రకారము జనకాత్మజను వెదకుచుఁ బోవుచుండిరి.

త్రోవలో కబంధుఁడను రాక్షసుఁడు వారిని మ్రింగ నుద్యమించెను. వారంతట నారాక్షసుని వధించిరి. వాఁడు శాపవిముక్తుఁడై వారికిఁ గర్తవ్యాంశము నుపదేశించి యరిగెను. రామలక్ష్మణులు ఋశ్యమూకపర్వతమున నున్న సుగ్రీవుని దగ్గఱకుఁ బోయి వానితో మైత్రిని సంపాదించిరి. శ్రీరాముఁడు సుగ్రీవుని శత్రువగు వాలిని వధించి సుగ్రీవుని కిష్కింధాపురమున కధిపతిని జేసెను. సుగ్రీవుఁడు సీతను వెదకుటకు బలవంతులగు వానరుల నన్నిదిక్కులకును బంపెను. వా

రిలోఁ గొందఱు దక్షిణదిశకుఁ బోయిరి. వారికి సంపాతియను పక్షీంద్రుఁడు సీత లంకలో నున్నదని చెప్పెను. అప్పుడు వారిలో హనుమంతుఁ డను వానరుఁడు సముద్రమును దాఁటి లంకలోఁ జొచ్చి రావణాంతఃపురమునకు సమీపమునందుండు నశోకవనమునందు విషలతలనడుమ సంజీవినీలత యున్నట్లు రాక్షసస్త్రీలనడుమ నుండిన సీతాదేవిని జూచి యామెకు శ్రీరాముని సందేశమును దెల్పి తదంగుళీయక మొసంగి యామె దుఃఖమును బాపెను. సీతాదేవి యానందబాష్పములతో నాయుంగరము నందుకొని తనసంకేతమును జెప్పి తనభూషణము నొకదానిని గురుతుగా నొసంగెను. హనుమంతుఁడు రాక్షసులతో యుద్ధముఁ జేసి యక్షకుమారునిఁ జంపి లంకాపట్టణమును దహించి తిరిగి సముద్రము దాఁటి శ్రీరామసుగ్రీవప్రభువులకడకుఁ జేరి సీతవార్తను దెలిపి తద్భూషణ మొసంగెను. శ్రీరాముఁ డాభూషణముఁ గైకొని యమందానందమునంది హనుమంతుని గౌరవించి వానరసైన్యమును వెంటఁబెట్టుకొని లంకాపురిమీఁదికి యుద్ధమునకు బయలుదేఱి దక్షిణసముద్రతీరమును జేరెను. అప్పుడు రావణుని తమ్ముఁడగు విభీషణుఁ డన్నవలనఁ బరాభవమునంది శ్రీరామచంద్రునికడకు వచ్చి యతని శరణుఁ జొచ్చెను. శ్రీరాముఁ డతని కభయ మొసఁగి లంకారాజ్యమునకు నిన్నధిపతినిఁ గావింతు నని వాగ్దాన మొసంగెను. విభీషణుఁడు భక్తిభావంబున మెలంగుచుండెను.

శ్రీరాముఁడు వానరులను నియోగించి సముద్రముపై సేతువు గట్టించి యాసేతువుమీఁదుగఁ దనసైన్యముతోఁ గూడ లంకానగరమున కరిగి రాక్షసులతో ఘోరసమర మొనరించి సపరివారముగ రావణాసురుని సంహరించి లంకారాజ్యమునకు విభీషణుని పట్టాభిషిక్తుం జేసి సీతాదేవిని రావించెను. ఆమెయు నగ్నిశుద్ధివలనఁ దనపవిత్రచరిత్రమును వెల్లడించెను. శ్రీరాముఁడు సీతాదేవిని మహానందముతోఁ బరిగ్రహించి విభీషణుఁడు దెచ్చిన పుష్పకవిమానము నెక్కి జానకితోడను లక్ష్మణసుగ్రీవ విభీషణులతోడను వానరసైన్యముతోడను నయోధ్యాపురమునకు వచ్చెను. అప్పటికిఁ బదునాలుగు వర్షములు గడచెను. అప్పుడు హనుమంతునివలన శ్రీరాముని యాగమనము నెఱింగి భరతుం డర్ఘ్యపాద్యాదులతో నెదురేగి యన్నను బూజించి పితృదత్తమగు రాజ్యము నతని కర్పించెను.

శ్రీరాముఁడు కులక్రమాగతమగు సింహాసన మధిష్ఠించి సమస్తబంధువులకును బ్రజలకును మహానందము కలిగించెను. అతఁ డధర్మమున కించుకేని యవకాశము లేకుండ ధర్మమార్గానుసారముగ మహీమండలమంతయు నేకచ్ఛత్రాధిపతియై పరిపాలించుచు ననేకధర్మకార్యము లొనరించెను. కొంతకాలమునకు సీతాదేవి గర్భము దాల్చెను. శ్రీరాముఁ డామెయందు మిక్కిలి యనురక్తుఁడై యుండెను. ఇట్లుండ నొక సమయమున శ్రీరాముఁడు గూఢచారులవలన రాజకుని యొద్దనుండి

దీసికొనివచ్చిన సీతను లోకులు సంశయించుచున్నా రని విని తనభార్య పతివ్రత యని తానెఱింగియు లోకాపవాదము సహింపరానిదగుటచే భార్యను బరిత్యజింపఁ దలంచి సీతను వాల్మీకి యాశ్రమసమీపారణ్యమున విడచి రమ్మని లక్ష్మణుని కాజ్ఞాపించెను. లక్ష్మణుఁడు తాను కార్యమునకు మిగుల వగచి యుఁ జేయునది లేక యన్న యాజ్ఞను నిర్వర్తించెను. సీతాదేవి యాఘోరారణ్యమున నేకాకినియై భీతిల్లి పెద్దపెట్టున నేడ్వఁ దొడఁగెను. అప్పుడు వాల్మీకిమహర్షి యాయార్తనాదము నాలకించి యచటికి వచ్చి సీతను జూచి యోగదృష్టిని యామె వృత్తాంతమంతయు నెఱింగి హితవాక్యముల నోదార్చి తన యాశ్రమమున కామెం దీసికొనిపోయి యామెకుఁ బరిచర్య సలుపుటకు మునికాంతల నియోగించెను. మునివనితలు వాత్సల్యముతో నామెను బోషించుచుండిరి.

ఇది యిట్లుండ నయోధ్యానగరంబున శ్రీరాముని యొద్ద కేఁ గొందఱు ఋషులు వచ్చి రాజా! మేము యమునాతీర వాసులము. నీవంటి ధర్మప్రభు వుండ మాతపస్సును వ్యయపఱచుట న్యాయము గాదని నీకడ కరుదెంచితిమి. రావణాసురుని సహోదరియగు కుంభీనసియను రాక్షసి కొక పుత్త్రుఁడు గలఁడు. వానిపేరు లవణాసురుఁడు. వాఁడు మహావీరుఁడు; మహాక్రూరుఁడు. వాఁడు మాయాగాదుల ధ్వంసము చేసి మమ్ముఁ బలువిధముల బాధించుచున్నవాఁడు. వానికొక శూలముగలదు.

అది వానియొద్ద నున్నంతవఱకును వానిని జయించుట కెవనికిని దరముగాదు. కావున నాశూలము వానికడ లేని సమయమునను గనిపెట్టి వానిని వధింపవలయును.' అని పలికిరి. శ్రీరాముఁడు ఋషులపలుకులు విని లవణాసురసంహారార్థము తనతమ్ముఁడగు శత్రుఘ్నుని నియోగించెను. శత్రుఘ్నుఁడు సైన్యసమేతుఁడై మహర్షులతో బయలుదేఱి వాల్మీకియాశ్రమము మీఁదుగ యమునాతీరప్రదేశమునకుఁ జేరెను. అప్పుడు లవణాసురుఁ డడవుల కరిగి యనేకప్రాణులను హింసించి తిరిగి వచ్చుచుండెను. శత్రుఘ్నుఁ డప్పుడు వానియొద్ద శూలము లేదని గ్రహించి వాని నడ్డగించి ఘోరముగ పోరు సలిపి తన వైష్ణవశరంబున నా రాక్షసునిఁ దెగటార్చెను.

అంతట నచటి ఋషులును బ్రజలును సమందానందము నొంది శత్రుఘ్నునిఁ గొనియాడిరి. శత్రుఘ్నుఁ డచ్చట మధురాపురంబును నిర్మించి తిరిగి యయోధ్యకు వచ్చి భ్రాతృవర్గమునకుఁ దద్వృత్తాంతము నంతయు వినిపించి వారికి సంతసముఁ గూర్చెను. ఇది యిట్లుండ వాల్మీకిమహర్షి యాశ్రమమున సీతాదేవికి జనించిన యిరువురు కుమారులకును వాల్మీకి 'కుశుఁడు' 'లవుఁడు' అను నామకరణములు చేసి వారికి సమస్తవిద్యలు చెప్పి తాను రచించిన రామాయణకావ్యమును గూడ నేర్పెను. అయోధ్యలో లక్ష్మణభరతశత్రుఘ్నులకు ముగ్గురకును గవలుగ నిరువురిరువురు కొడుకులు పుట్టిరి.

వారందఱును జాతకర్మాదిసంస్కారములఁ బొంది వృద్ధిఁ బొందుచుండిరి.

ఒకనాఁ డయోధ్యాపురవాసి యగు బ్రాహ్మణుఁ డొకఁడు మృతుఁడైన బాలుని దీసికొని వచ్చి శ్రీరామచంద్రునకుఁ జూపి రాజా! యిట్టి యకాలమరణమునకు నీపురప్రజల యధర్మప్రవర్తనమే కారణ మని పలికి దుఃఖింపఁ జొచ్చెను. శ్రీరాముఁ డావిప్రు నోదార్చి ధనుష్పాణియై పుష్పకము నెక్కి యన్నిచోట్లను బరిశీలించుచుండ నొకసరస్సునొద్ద నొకపురుషు డధోముఖుఁడై తపం బొనరించుచుండెను. శ్రీరాముఁ డచటదిగి యాపురుషుఁడు శంబూకుఁడను శూద్రుఁడనియు స్వర్గమునకై తపస్సు చేయుచున్నాఁ డనియు నెఱింగి ధర్మలోపభయంబునఁ దపస్సు నాచరించుట కనధికారియగు వాని శిరస్సును ఖండించెను. అంతలోనే యయోధ్యాపురమునఁ జచ్చిన బ్రాహ్మణపుత్త్రుఁడు జీవించెను. శ్రీరాముఁడు మార్గమధ్యమున నగస్త్యమహర్షి గలసి కంకణసత్కారము నంది యయోధ్యఁ జేరి యశ్వమేధయాగముఁ జేయ సంకల్పించి యెల్లర నాహ్వానించి తాను స్వర్ణసీతాప్రతిమను బత్నీప్రతినిధిగా నుంచి దీక్షితుఁడై యాగహయమును విడిచెను.

అంతట వాల్మీకిమహర్షి ప్రేరణచేఁ గుశలవు లయోధ్యానగరప్రాంతములఁ గ్రుమ్మరుచు రామాయణకావ్యమును

గానము చేయుచుండిరి. శ్రీరాముఁడు కర్ణాకర్ణిగా వారి గాన
కౌశలము విని యాబాలురఁ బిలిపించి వారివలన రామాయణ
కావ్యము నాలించి తాను రసికుఁ డగుటంజేసి దానిలోఁ గల
పారస్యమునకు డెందమున మితిలేని యానందమును జెందుచు
బాలులారా! మీరిప్పుడు చదివిన కావ్యమును రచించిన వారె
వరో? యిది మీకు నేర్పిన వారెవరో? చెప్పఁగలరా? యని
యడిగెను. బాలురు వాల్మీకిమహర్షి యని చెప్పిరి.

శ్రీరాముఁడు వారలను వెంటఁబెట్టుకొని శీఘ్రముగా
వాల్మీకిమహర్షి కడకరిగి యథోచితసత్కారము లొనరించి
యమ్మహర్షికిఁ దనరాజ్యము నర్పించెను. వాల్మీకిమహర్షి శ్రీరా
మచంద్రా! నీభార్యయగు సీతాదేవియు నీకుమారులగు కుశ
లవులును నాయాశ్రమంబున నుండిరి. వీరిని నీవు పరిగ్రహిం
పుము. అని కోరెను. శ్రీరాముఁడు తాతా! మున్నుదశ రావ
ణునియొద్దనుండి వచ్చినందున మీకోడలిపైయపవాదము పౌరులకు
సంశయాస్పదముగ నున్నది. కాని యగ్నియందుఁ దనశుద్ధచరి
త్రమును వెల్లడించినందున నాకెట్టి సందియమును లేదు. ఇప్పు
డాసీత దనచరిత్రము పవిత్రమైన దని పురజనులకు విశ్వాసముఁ
గలిగించినచోఁ బుత్త్రులతోఁగూడ నామెను బరిగ్రహించుట
కభ్యంతరము లేదు. అని పలికెను. వాల్మీకిమహర్షి సీతను
రావించి యచట నున్న వారినందఱను వెంటఁ బెట్టుకొని య
యోధ్యాపురంబున కరిగి పురజనుల నెల్లర రావించి వారియె

దుట "అమ్మా సీతా! నీచరిత్రమునఁ బ్రజలకుం గలిగిన సందే
యమును తొలఁగింపుము" అని పలికెను. సీతాదేవి వాల్మీకి
శిష్యుఁ డందించిన పుణ్యజలంబున నాచమించి "ఓవిశ్వంభరా
దేవీ! మనోవాక్కాయకర్మంబుల భర్తృవిషయమున నే నెట్టి
యపచారమును నాచరింపక పతివ్రతనగుదునేని నన్ను నీగర్భం
బున దాఁచికొనుము" అని పలికెను. అప్పుడు భూమి బ్రద్ద
లయ్యెను. దానిలోనుండి విద్యుల్లతవలె భూదేవి ప్రత్యక్షముగా
వచ్చి సీతాదేవి నెత్తుకొని వివరములోనికిఁ బోయెను. అనంత
రము శ్రీరాముఁడు సీతకై పరితపించుచుండ వాల్మీకిమహర్షి
సదుక్తులచే సమునయించి తోనరిగెను.

పిమ్మట శ్రీరాముఁ డశ్వమేధయాగము నంతము నొం
దించి యాగమునకు వచ్చిన వారల నెల్లరను వీడ్కొలిపెను.
పిదప శ్రీరాముఁడు భరతునకు సింధుదేశమును లక్ష్మణునకుఁ
గారాపథదేశమును శత్రుఘ్నునకు యమునాతీరదేశమును నొ
సంగెను. భరతుఁడు తక్షపుష్కలులను తనపుత్రులను "తక్ష
శిల" "పుష్కలావతి" అను నగరముల కధినాథులనుగా నొన
రించి సింధుదేశము వారిస్వాధీనము చేసెను. లక్ష్మణుఁడు అంగ
దచంద్రకేతులను తనకుమారులను గారాపథదేశమున కధిపతు
లనుగా నొనరించెను. శత్రుఘ్నుఁడు సుబాహుశత్రుఘాతు
లను తనతనూజులను మధురావిదిశాపురములకుఁ బ్రభువుల
నుగాఁ జేసి యమునాతీరదేశము వారి కధీనముగాఁ జేసెను.

అంతట యముఁడు మునివేషముం దాల్చి శ్రీరాముని కడకు వచ్చి రామా ! నీకొక రహస్యముం జెప్ప వచ్చితిని. దీని కెవరైనను విఘ్నముఁ జేయునెడల వారిని నీవుదప్పక పరిత్యజింపవలయునని పలికి తదంగీకారము వడసి "పరమేశ్వరుని యాజ్ఞయైనది నీవు స్వర్గము నలంకరింపుము" అని చెప్పుచుండు సమయముననే ద్వారముఁ గాచుచుండిన లక్ష్మణుఁడు రామ దర్శనార్థియై వచ్చిన దుర్వాసుని యాగమనముఁ దెలుపుటకై యచటికి వచ్చి రాముఁడు యమునితోఁ జేసికొనిన యొడంబడికను దెలిసికొని యున్నఁడును నెడఁబాయని యన్నను విడిచి యుండుట తనకు దుష్కరమని తలంచి వెంటనే సరయూతీరమందుఁ బ్రాణాయామముచే దేహత్యాగముఁ గావించెను. అంతట శ్రీరాముఁడు తమ్ముని వియోగమును సహింపఁ జాలక కుశావతీపురమందుఁ గుశుని శరావతీపురమందు లవుని స్థాపించి తత్కాలోచితమగు విమానమును దా నధిష్ఠించి భరతశత్రుఘ్నులతోఁ గూడ స్వర్గమున కేగెను.

—: కుశమహారాజ చరిత్ర :—

రామలక్ష్మణ భరతశత్రుఘ్నుల కుమారులందఱును బరస్పరము సద్భావములతో మెలఁగుచుండిరి. వారందఱును బ్రత్యేకభూభాగములను బాలించుచుఁ బెద్దవాఁడగు కుశమహారాజునందు భక్తిప్రపత్తులుం గలిగి యుండిరి. కుశత్ప్మాపతి కొక

నాఁటి యర్ధరాత్రివేళ నయోధ్యానగరాధిదేవత భర్తృవియోగదుఃఖిత యగు వనితవలెఁ గన్పట్టి రాజా ! సకలసంపదలతోఁ దులతూఁగుచుండెడి యయోధ్యాపుర మిప్పుడు నాథుఁడు లేమిచేఁ బాడువడిన కొంప వగిది యున్నది. మొదటినుండియు సూర్యవంశరాజులకు ముఖ్యరాజధానియై మీ తాతతండ్రుల కాలమునుండి పేరెన్నికగన్న యయోధ్యాపట్టణమును విడనాడుట నీకు ధర్మము గాదు. నీ వీ కుశావతిని విడిచి శీఘ్రముగా రమ్ము. నీకు మేలుగలుగును అని పలికి తాను దన్నగరాధిదేవతనని కూడఁ దెలిపి యదృశ్యయాయెను.

ప్రాతఃకాలమునఁ గుశమహీపతి మహాసభకు బ్రాహ్మణులరావించి రాత్రిజరిగిన వృత్తాంతమంతయు విన్నవించి దీని ఫల మేమని యడిగెను. విప్రులు మహారాజా ! నీ కిది మంగళక్షేమంకరము. ఇట్లే చేయుము. అని పలికిరి. పిదపఁ గుశుఁడు కుశావతిని శ్రోత్రియబ్రాహ్మణుల స్వాధీనము చేసి తాను సైన్యముతో నయోధ్య కేగి యచటి శిథిలములగు భాగములనెల్ల బాగుచేయించి పూర్వవైభవంబులకు వన్నెఁగలిగించి పాలించుచు నొకనాఁ డొక సరస్సులో నంతఃపుర కాంతలతో జలక్రీడలాడుచుఁ దన చేతికంకణమును బోఁగొట్టుకొనెను. మున్నగస్త్యుఁడు జయలక్ష్మి నెల్లప్పుడు విడనాడకుండునట్లు శ్రీరామచంద్రున కాకంకణముఁ బ్రసాదించి యుండెను. శ్రీరాముఁడు రాజ్యముతోఁగూడ దానిని కుశున కొసంగి

యుండెను. కొన్నాళ్ళఁ గుశుండు దానిపోకకు మిక్కిలిఁ జింతించి దానిని వెదకుటకు నీఁదనేర్చిన వారిని నియోగించెను. వా రా భరణంబెయ్యును వెదకి వేసారి రాజా! యీ సరయువులో నొక గొప్ప సర్పము గలదు అది యీ యాభరణమును హరించియుండ వచ్చునని చెప్పిరి. కుశమహారాజు క్రుద్ధుండై ధనువెక్కిడి యాస ర్పముపై గారుడాస్త్రమును బ్రయోగించెను. అంత సరస్సంత యూ నల్లకల్లోలమయ్యెను. అప్పు డా యస్త్రమునకు భయపడి కుముదుం డనువాఁ డాకంకణమును తనచెల్లెలగు కుముద్వతి యను కన్యకను గూడఁ దెచ్చి కుశునకు సమర్పించెను. కుశమ హారాజు సంతసించి కుముద్వతిని యథావిధిని బెండ్లాడి యామె యందు "అతిథి" యను సుపుత్రునిఁ బడసెను.

అతనికి కులక్రమాగతములగు విద్యలు నేర్పించి ప్రా జ్ఞునిఁ జేసి పట్టాభిషిక్తునిఁ గావించి తాను దేవేంద్రుని యాద రమున ననేకసంవత్సరములు రాక్షసులతోఁ బోరాడి వారిని బరాజితులఁ గావించి తుదకొకవేళ నింద్రునిచే సహాయుఁడై దైత్యులతో సమరము సలుపుటకు స్వర్గమున కరిగెను.

—: అతిధివంశ్యక్రమము :—

అతిథికి నిషధుండును నిషధునకు నలుండును నలునకు నభసుండును నభసునకు పుండరీకుండును పుండరీకునకు క్షేమ ధన్వంతుఁడును క్షేమధన్వంతునకు దేవానీకుండును దేవానీకు

నకు అహీనగుండును అహీనగునకు పారియాత్రుండును పారియాత్రునకు శీలుండును శీలునకు ఉన్నాభుండును ఉన్నాభునకు వజ్రనాభుండును వజ్రనాభునకు శంఖణుండును శంఖణునకు వ్యుషితాశ్వుండును వ్యుషితాశ్వునకు విశ్వసహుండును విశ్వసహునకు హిరణ్యనాభుండును హిరణ్యనాభునకు కౌసల్యుండును కౌసల్యునకు బ్రహ్మిష్ఠుండును బ్రహ్మిష్ఠునకు పుత్రుండును పుత్రునకు పుష్యుండును పుష్యునకు ధ్రువసంధియు ధ్రువసంధికి సుదర్శనుండును బుట్టిరి. వీరు రఘువంశప్రతిష్ఠకు వన్నెఁబెట్టుచు నప్రతిహతముగ రాజ్యపాలనముఁ గావించిరి. సుదర్శనునకు అగ్నివర్ణుఁ డుదయించెను. అతఁడు కేవలభోగలంపటుఁడగుటం జేసి క్షయరోగపీడితుఁడై మరణించెను. పిదప గర్భవతియైన తద్ధర్మపత్ని సింహాసన మధిష్ఠించి రాజ్యమేలెను.



# కుమారసంభవము



ఉత్తరదిశయందు హిమవంతుఁ డను పర్వతరాజు కలఁడు. అతఁడు దేవతాత్మకుఁడును సకలరత్నౌషధులకు నిలయమును బూర్వాపరసముద్రములను వ్యాపించినవాఁడునునై యుండి పితృదేవతల మానసపుత్త్రి యగు మేనకను వివాహమాడెను. వారికిరువురకును మొదట మైనాకుఁ డను పుత్త్రుఁడు గలిగెను. పిదపఁ బార్వతి యనుపుత్త్రిక కలిగెను. ఆమె పూర్వజన్మమున దక్షుని కూఁతురై శివునకు భార్యయైన సతీదేవి. ఆమె యొకనాఁడు తండ్రియగు హిమవంతునియొద్దనుండఁగా నారదముని వచ్చి పర్వతరాజా! నీకూఁతురు శివునకు భార్య కాఁగలదని చెప్పి వెడలిపోయెను. అదిమొదలు పార్వతిమనస్సు శివునియందు లగ్నమయ్యెను. శివుఁడు భార్యావియోగము గలిగినతరువాత మఱియొక పత్నిని బడయు నిష్టము లేక హిమవన్నగముఁ జేరి యం దొకగుహలోఁ దపస్సు చేసికొనుచుండెను.

—: పార్వతి శివునకు శుశ్రూష చేయుట :—

హిమవంతుఁ డొకనాఁడు పార్వతిని వెంటఁబెట్టుకొని యీశ్వరునియొద్ద కేఁగి యీమె నా శివునకు శుశ్రూషఁ గావింపు

నియోగించెను. శంకరుం డందుల కంగీకరించెను. అదిమొదలు
పార్వతి శ్రద్ధాభక్తులతోఁ బరమేశ్వరునకు శుశ్రూష గావించు
చుండెను.

## —: మన్మథుఁడు దగ్ధుఁడగుట :—

అనంతరము దేవతలు తారకాసురుని బాధలు పడఁ జాలక బ్రహ్మదేవునికడ కరిగి బహువిధముల స్తోత్రములు గావించి చేతులు జోడించి దేవా! తారకుండను రాక్షసుఁడు నీవలనఁ బెక్కువరములు వడసి యెల్లలోకములను బీడించు చున్నాఁడు. వాని దత్తవరబలోద్రేకమునకు లోకము లిఁక నిలువఁజా లవు. కావున శివజన్ముఁడగు సేనాపతి నొకని సృజింపుము. తదాధిపత్యంబున నిందుము దేవసైన్యముతో వెడలి తారకా సురుని సంహరింపఁగలము అని ప్రార్థించిరి. పితామహుఁడు సురలారా! యథార్థమును వచించెదను వినుఁడు. ఈకార్యము సాధించుటకుఁ బరమేశ్వరుని తనూజుఁ డొక్కఁడే సమర్థుఁడు. మే మెవ్వరమును సమర్థులము కాఁజాలము. కావునఁ బరమేశ్వ రునకుఁ బుత్త్రుండు గలుగుటకుఁ దగినయత్నముఁ గావింపుఁడు. తదాత్మజుఁడు మీకార్యము నెఱవేర్పఁగలఁడు. అని చెప్పెను. అంతట దేవతలు తదాజ్ఞను గైకొని తమతమ నిలయములకరి గిరి. దేవేంద్రుఁడు మన్మథుని రావించి మనోభవా! నాకు రెండస్త్రములు కలవు. అందుఁ బ్రథమాస్త్రము నీవు; ద్వితీయా

స్త్రము వజ్రాయుధము పై బెట్టినప్పుడు కార్యము నైనసాధింప
గలవు వజ్రాయుధము తపోవంతులయెడ నేకమోఘింపదు.

కావున నీవు నొక దేవకార్యమును నిర్వహింపవలె
యు. నాకు నీవంటి కార్యసాధకుఁడు గానరాఁడు. తత్కార్య
కరణంబున సమస్తలోకంబులకు నుపకారము చేసినవాఁడ వగు
దువు. అది యేయన లోకకంటకుఁడగు తారకాసురుని వధిం
చుటకు పరమశివతనూజుండు దక్క వేరొకఁడు శక్తుఁడు గాఁడు.
ఇప్పుడు శివుఁడు హిమవత్పర్వతగుహాలోఁ దప మొనరించు
చున్నాఁడు హిమవంతుని కొమార్తె యుమాదేవి శుశ్రూష గా
వించుచున్నది. నివస్సర్పికి కలిగి శివున కామె యందు మోహము
గలుగునట్లు చేయవలయును. దాన నా కార్యము సిద్ధింపఁగల
దు. అని పలికెను. మన్మథుఁడు నాసవ ప్రేరితుఁడై రెట్టించిన
యుత్సాహంబునఁ బంచబాణములతో నీశ్వరుని యాశ్రమంబున
కరిగి వ్యాఘ్రచర్మాసీనుండగు శంకరునిఁ గాంచెను. అప్పుడు
పార్వతి పుష్పభాజనములతోఁ జంద్రశేఖరుని సమీపించి నమ
స్కరించి యతని హస్తంబులోఁ బద్మమాల నుంచుచుండెను.
మదనుఁడా సందను గని పెట్టి శివునిపై సమ్మోహనాస్త్రమును
బ్రయోగించెను. అంత శివునకుఁ జిత్తవికారము కలుగఁజొచ్చె
ను. వశ్యేంద్రియుండగు పరమేశ్వరుం డీచేతో వికారమునకుఁ
గారణమేమీ ? యని నలుదిక్కులఁ జూడఁజూచి ధనుర్ధరుఁడై
నిలువఁబడి యున్న పంచశరునిఁ గాంచి తన సమాధిని జెఱచె

వను వ్యాగ్రహంబునఁ దన లలాటనేత్రాగ్నిజ్వాలలచే నతని దహించి యంతర్ధానమొందెను.

—: ఆకాశవాణి :—

రతీదేవి భర్తృమరణమునకు శోకించి స్మృతి దప్పి భూమిపైఁ బడి కొంతతడవునకుఁ దెలివిఁ దెచ్చికొని పరిపరివిధముల విలపించుచుఁ దుద కాత్మహత్యను గావించుకొన నిశ్చయించియుండెను. అంతలో నాకాశవాణి రతీ! నీభర్త యచిరకాలముననే తిరిగి జీవింపఁగలఁడు. నీవు దుఃఖింపకుము. అతఁడు కమలాసనునకుఁ దన కుమారి యగు సరస్వతియం దనురాగముఁ గల్పించినందున బ్రహ్మ తన మనోవికారము నడంచికొని కోపముతో మారా! నీవిట్టి యకృత్య మాచరించినందునఁ ద్ర్యంబకుని నేత్రాగ్నిని భస్మము గాఁగల వని శపించెను. అంత ధర్మప్రజాపతి విరించిన శాంతునిఁ గావించి లోకరక్షణార్థము తచ్ఛాపావసానమును యాచించెను. చతురాననుఁడు పార్వతితపమునకు మెచ్చి మృత్యుంజయుఁ డామె నెప్పుడు పెండ్లాడునో యప్పుడు కందర్పుఁడు జీవములతో స్వశరీరము నందఁగలఁడు. అని యనుగ్రహించెను. కావున మాన్మందు భర్తతో సుఖించుటకు నీశరీరమును గాపాడుకొనుము. అని పలికెను. రతీదేవి యశరీరవాణి పలుకులు విని దుఃఖ ముపశమింపఁజేసికొని పార్వతీపరిణయంబున కెదురుచూచుచుండెను. హిమవంతుఁడు శివకో

హాగ్నికి వెలిచి పుత్రికను దన నిలయమునకుఁ దోడ్కొని బోయెను.

## —:పార్వతికి శివుఁడు ప్రత్యక్ష మగుట:—

అంతటఁ బార్వతి శివుండు తనకన్నులయెదుట గాముని దగ్ధము చేయుటయు నుగ్రరూపు గాంచెడి తన్ను విడిచి యంతర్హితుం డగుటయుఁ దలంచికొని యింక నతఁడు తన్నుఁ బరిగ్రహించుట కల్ల యని నిరాశఁ జెంది తన సౌందర్యము నిష్ఫలం బనియు భర్త లేని బ్రతుకు వ్యర్థమనియు హృదయశరితాపంబునఁ బొక్కుచుఁ గొంతతడవునకు ధైర్యముఁ దెచ్చుకొని తపం బొనరించి యీశ్వరుని భర్తగాఁ బడయఁ గలనని నిశ్చయించుకొనెను. మేనక తన కొమరిత తపం బొనరింప నిశ్చయించుకొనె నని తెలిసికొని యామె నాకఠినకార్యమునుండి తొలగింపఁ దలఁచి యనేకప్రబోధములు గావించెను. పార్వతి తల్లిమాటలు వినక దృఢమనస్కయై తండ్రియనుమతివడసి సఖీసమేతముగఁ దశశ్వరణమున కనువగు గౌరీశిఖరప్రదేశమునకరిగి యచటమునివేషంబున నియమితవ్రతయై ఘోరమగు తపస్సు గావింపఁ దొడంగెను క్రమక్రమముగ నామె తపంబు పరిపక్వస్థితికి వచ్చెను. అప్పుడు పరమేశ్వరుఁడు పార్వతి హృదయదార్ఢ్యమును బరీక్షింపఁ దలఁచి బ్రహ్మచారి వేషమును దాల్చి యామెకడ కరుదెంచి తదుపచారములు లంది మెల్ల

మెల్లఁగ శివదూషణరూపములగు విపరీతవచనంబులు పలికెఁ గాని యామె హృదయము నెంత మాత్రము చలింపనందున సంతోషాతిశయంబుతో నామెకు స్వస్వరూపమునఁ బత్యక్షమై యపర్ణా! నీతపంబునకు మెచ్చితిని. నిన్నుఁ బరిగ్రహించెదను. అని పలికెను. పార్వతి లజ్జాభరంబునఁ దలవాంచి మాతండ్రియనుమతి వడసి యథావిధిని నన్నుఁ బరిగ్రహింప వలయును. అని సఖీముఖంబుగ విన్నవించెను. పిదప నిల్లరువురు దమతమ నివాసంబులకరిగిరి

—:పార్వతీ పరమేశ్వర పరిణయము:—

పరమేశ్వరుఁడు సప్తర్షుల నొక్కపరి స్మరించెను. తోడనే వారీశ్వరుని కడకు వచ్చి యంజలులొగ్గి దేవా! మావలనఁ గావలసిన కార్యమేదియో యాజ్ఞాపింపుమని ప్రార్థించిరి. ఈశ్వరుఁడు మునులారా! జగదుపద్రవకారకులగు దుర్మార్గులను నశింపఁజేయుటకు దేవతలు నాకు జన్మించిన కొమరుండు కావలయునని కోరుచున్నారు. కావున హిమవంతునిపుత్త్రిక యగు పార్వతియం దాత్మజునిఁ బడయుటకు నిశ్చయించితిని మీరు హిమవంతునికడకేగి కార్యమునా నెఱవేర్చికొని రండు. నేను మహాకోశీనదిదగ్గఱ మీరాకకు నిరీక్షించుచుందును. మీరచటికే రండు. అని యాజ్ఞాపిం

చెను. మహర్షులు శివాజ్ఞను శిరంబునఁదాల్చి హిమవంతునికడ కరిగి గిరీంద్రా! పరమేశ్వరుండు నీకుమారి వివాహమాడ వలయునని కోరుచున్నాఁడు. నీపుణ్యములు ఫలించినవి. జగద్గురు నకుఁ గూడ గురుండవయ్యెడి భాగ్యము లభించినది. అని పలుకఁ బర్వతరాజు భార్యాపుత్త్రికలవైపుఁ జూచి ప్రసన్నముఖుఁడై ఋషులఁ బట్టి వారి యాశయము నుల్లంగి మహానందముతోఁ గుమారిం జూచి వత్సా! ఇటు రమ్ము. విశ్వాత్మకుఁడగు మహేశ్వరునకు నిన్నర్పించి యిహపరలోక తారకం బగు కన్యాదానఫలం బనుభవింపఁ గల మహాభాగ్యము నాకుఁ దటస్థించినది నేను ధన్యుఁడను. అని పలికి మహర్షులతోఁ బరమేశ్వరునివధువుగా మీకు సమర్పించుచున్నది అని పలి కెను. పార్వతి వారికి నమస్కరించెను. మహర్షులామెను దీవించి మరల హర్షముతోఁగూడ [illegible] ప్రయాణమై మహాకోశీనదియొద్ద శివునిఁ గలిసికొని కార్యసిద్ధిని నివేదించి స్వస్థానముల కరిగిరి.

హిమవంతుఁడు కుమారీవివాహమహోత్సవము కొఱకు సకలసంభారములు సంతరించి బంధుగణంబుల నెల్ల రావించి సిద్ధముగ నుండెను. అంతలో శంకరుఁడు పత్నీసహితులగు దేవమునులతో నచటికిఁ దరలివచ్చెను. హిమవంతుఁడు పరమేశ్వరునిఁ దోడ్కొనిపోయి కళ్యాణమండపమునందుఁ దనపుత్త్రికయగు పార్వతి నిచ్చి పాణిగ్రహణమహోత్సవము

మంగళవాద్యాదిసకలవైభవంబులతో నలవేర్చెను. అప్పుడు దేవతలు మహానందముతోఁ బార్వతీనాధునకుఁ బ్రణామము గావించి దేవా! పార్వతీపరిణయమువలన మన్మథునకు శాపమోక్షము కలిగినది. నీవిపు డతని సేవ కంగీకరింపవలయు నని ప్రార్థించిరి. శివుం డందుల కంగీకరించెను. తోడనే మన్మథుఁడు వచ్చి శంకరుని పాదములపైఁ బడెను. పిదప నందఱును హిమవంతుని సత్కృతులొంది తమతమ నిలయములకరిగిరి.

## — కుమారజననము —

అంతట శివుండు హిమవంతుని సత్కారములు పొంది ధర్మపత్నియగు పార్వతితోఁగూడఁ గైలాసమున కరిగి యచట నామెతో నేకాంతగృహమున నున్న సమయమున నొక పావుర మచటికి వచ్చెను. ఈశ్వరుఁ డాకపోతము నగ్నిదేవునిగా నెఱింగి కోపారుణిత లోచనుఁడయ్యెను. తోడనే వైశ్వానరుఁడు కపోతరూ[redacted]ము విడిచి స్వస్వరూపము తాల్చి భయ[redacted]న [redacted]ఁ గేల్మోడ్చి దేవా! నేను దేవేంద్రుఁడు పంపఁగా వచ్చితిని. అతఁడు శత్రుబాధలకుఁ దాళజాలకున్నవాఁడు. నీ వేకాంతస్థుఁడ వగుటవలన బహుకాలమునుండి నీసేవ యతనికిఁ దటస్థింపదయ్యె. ఎట్టివాఁడైనను నెంతకాలము మహావిపత్తులలోఁ బడి యుండఁగలఁడు?

కావున నీసేవకొఱకు నే నిట్లువచ్చితిని. నీవు దేవసేనాధిపతి యగుటకు శక్తుఁడగు పుత్త్రుని సృష్టింపుము. లోకములను రక్షింపుము. అపకారమున నే నిట్లు వచ్చినందులకు నాయప రాధమును దేవేంద్రుఁడు ప్రేరకుఁడైనందున నతని యప చారమును క్షమించి కాపాడుము. అని ప్రార్థించెను.

పరమేశ్వరుఁ డావహ్ని పలుకులు విని ప్రసన్నచిత్తుఁడై యతని క్షమించి ప్రళయాగ్నివంటి తన తేజస్సును జాత వేదుని యందుంచెను. పార్వతీదేవి తన భర్తృసేవకు భంగము కావించినందునఁ గోపితయై యగ్నిదేవునిఁ జూచి నీవు సర్వభక్షకుండవును గుష్ఠరోగము కలవాఁడవును ధూమకర్బుండవును నగుదువుగాక యని శపించెను. వీతిహోత్రుఁడు తనకుఁ గలిగిన యీయాపదకు వగచుచు నెట్టకో యింద్రుని కడ కరిగెను. దేవసభాభవనంబున దేవేంద్రుఁ డాసీనుఁడై యుండ వికృతాకారముతో నతికష్టంబున హుతాశనుఁడు ప్రవేశించెను. ఇంద్రాదిదేవతలు భయవిస్మయంబులు దోఁప నతనిఁ జూచి నీయీయాదవశకుఁ గారణ. [redacted]. అగ్నిదేవుఁడు పురందరునిఁ జూచి మహాప్రభూ! నేను నీయానతిచొప్పునఁ గపోతరూపమునఁ బార్వతీపరమేశ్వరుల యేకాంత గృహంబున కొచ్చితిని. ఈశ్వరుఁ డంతట పరుగ్నిగాఁ నెఱింగి క్రుద్ధుఁ డాయెను.

అప్పుడు నేను నిజరూపమును దాల్చి భయకంపితగాత్రుఁడనై యథార్థవృత్తాంత మంతయు నివేదించితిని. అంత శంకరుఁడు ప్రసన్నుఁడాయెను. కాని ప్రళయకాలానలసన్నిభం బగు తన తేజంబును నాయం దుంచెను. తత్తేజంబున నాయవయవంబులు దగ్ధము లగుచున్నవి. నా ప్రాణంబు లింక నిలువవు. నన్నెట్లైన యాయాపత్తునుండి రక్షింపుము. అని వేఁడుకొనెను. సురేంద్రుఁడు వాచస్పతితో నాలోచించి పావకా! నీ వీక్షణంబుననే గంగానదికడ కరిగి యందు స్నానము చేయుము. భాగీరథి యష్టమూర్తి శరీరములలో నొకటి. కావున శివతేజం బాదేవి గ్రహించి నిన్ననుగ్రహింపఁగలదు. ఆలసింపకుము. పొమ్ము అని పలికెను. అంతట వీతిహోత్రుఁడు గంగానదిలో రుద్రతేజము విడిచి స్నాతుఁడై బ్రతికితి నని సంతోషముతో నిజవాసమున కరిగెను.

అంతటఁ గృత్తికలను నార్గురు స్త్రీలు మాఘమాసమునఁ బ్రాతస్స్నానార్థము గంగానదికి వచ్చి యన్నదిని స్తుతించి నమస్కరించి యందు స్నానము కావించుచుండిరి. అప్పుడు వారిగర్భకోశములలో శివతేజము ప్రవేశించెను. వారు నదినుండి బయటికి వచ్చి రుద్రతేజస్సంభవమగు మహాతాపము నకు సహింపజాలక శోకించుచుఁ గొంతతడవున కొక శరవణంబునఁ దద్గర్భంబులు విసర్జించి సుఖముగఁ దమతమ గృహములకరిగిరి. కృత్తికలు శరవణమం దుంచిన యాఱుభా

గంబు లగు రుద్రతేజంబులు గలిసికొని యాఱుశిరస్సులు గల
మగపిల్లవాఁ డాయెను. అతఁడు తేజోరాశివలె దేదీప్యమానుఁడై
ప్రకాశించుచుండెను.

—కుమారుఁడు దేవసేనాపతి యగుట.—

అప్పుడు దివౌకసులు గంగాదేవిని స్తుతించి యాశిశు
వును బోషింపవలయునని యాచించిరి. భాగీరథి దివ్యాంగనా
రూపముఁ దాల్చి యాశిశువునకుఁ దన స్తన్యమునంగి కాపా
డుచుండెను. అంతలో నగ్నిదేవుఁడును కృత్తికలును నీవార్తవిని
యచటికి వచ్చి యాశిశువును జూచి యానందము నందిరి.
అప్పుడు గంగాదేవియు ననలుండును కృత్తికలును నీబాలుఁడు
'నాకొడుకు' 'నాకొడుకు' అని పరస్పరముగ గలహింపఁ
జొచ్చిరి. అప్పుడు విమానము నెక్కి పార్వతీపరమేశ్వరు లచటికి
వచ్చిరి. పార్వతీదేవి యాబాలునిఁ జూచి యబ్బురమంది నాథా!
యీబాలుం డెవ్వఁడు? యీతని తలిదండ్రు లెంతటి ధన్యా
త్ములోగదా? యిట్టిసర్వలక్షణసంపన్నుండగు కుమారుఁడు నా
కిచ్చటను గనఁబడలేదు. ఆహా! యీతని దేహతేజఃపుంజము
నేమని చెప్పఁగలను? అని పలికెను. చంద్రశేఖరుఁడు మంద
హాసము చేయుచు దేవి! నే నగ్నియందుంచిన బీజము నతఁడు
గంగయందుంచెను గంగ కృత్తికలయందుంచెను. వారి గర్భ
సంకర్షమున శరవణంబున నీబాలుఁడు పుట్టెను. కావున నీశిశువు

నీపుత్త్రుఁడే నీవే యెట్టి ధన్యవు. నీ వీతనిఁ దీసికొనిరమ్ము అని పలికెను. హైమవతి విమానము డిగి యక్కుమారునిఁదీసికొని ముద్దాడుచుఁ దిరిగి విమాన మధిష్ఠించి భర్తతోఁ గైలాసమున కరిగెను.

తోడనే గంగయు నగ్నియుఁ గృత్తికలును దమతమ వివాదములు చాలించి నిజావాసంబులకుఁ జనిరి. పిదపఁ బార్వతీనందనుఁడు కుమారుఁ డను నామము వడసి యాయావనమున నయ్యుక్తవయస్సున సకలశస్త్రశాస్త్రవిజ్ఞానమును బొంది లోకైకవీరుఁ డయ్యెను. అప్పుడు దేవేంద్రుఁడు విబుధులతోఁ గలసి కైలాసమున కేఁగి శంకరుని దర్శించి సాష్టాంగప్రణామములాచరించెను. మృత్యుంజయుఁడు కుశలప్రశ్నము గావించి యతని నాదరించెను. జిష్ణుఁడు కరములు మోడ్చి దేవా! తారకాసురుని జయించుటకుఁ గుమారునిఁ బంపవలయును. అతఁడు మాకు సేనాపతిగా నుండఁగలఁడు. అని యర్థించెను. శివుండు కుమారుని రావించి కుమారా! నీ వింద్రశత్రువగు తారకాసురుని వధించి సురలకు స్వర్గాధిపతులనుగా నింపుము. అందువలన జగదుద్ధారకుఁడవై రూపుపొమ్ము. అని యాజ్ఞాపించెను. కుమారుఁడు పిత్రాజ్ఞను శిరంబునఁదాల్చి తల్లిదండ్రులకు నమస్కరించి వారియాశీర్వాదములు వడసి దేవేంద్రునితోఁ బ్రయాణమై నక్షత్రమార్గమును దాఁటి యమరావతీనగరసమీపమునకు వచ్చెను.

త్రిదశులు చిరకాలమునకుఁ దమనగరమునకు రాఁగలిగినందులకు సంతసించి తమ స్వర్గపురమునఁ దారకాసురుఁడు గలఁడను భయంబున నీవు ముందు నడువుము నీవు ముందు నడువుము అని పలికికొనుచు ముందునడచుటకు జంకుచుండ షాణ్మాతురుఁడు వారింజూచి చిఱునవ్వునవ్వుచు నిర్జరులారా ! మీరు భయపడకుఁడు నేను ముందుండెదను రండు. తారకాసురుఁడు నాకంటఁబడెనేని యాక్షణంబుననే యాతని రూపుమాపెదను అని గంభీరముగఁ బలికి ముందు నడువఁదొడంగెను. విబుధులంతట ధైర్యముతో నాతని వెంట నడువఁజొచ్చిరి. సునాసీరుఁడు స్కందుని ముందుగ వైజయంత మను నాత్మసౌధమునఁ బ్రవేశపెట్టి దేవసైన్యములకెల్ల నధిపతిగా నభిషేకము గావించెను.

### —• కుమారుఁడు తారకాసురుని వధించుట •—

అంతటఁ గుమారుఁడు "అదితికశ్యపులను" గాంచి సాష్టాంగప్రణామము లాచరించి వారి యాశీస్సులను బొంది విజిత్వర మను నరదము నెక్కి శక్తి యను నాయుధమును ధరించి సకలనిర్జరులును యోధులై వెనువెంట వచ్చుచుండఁ బ్రళయకాలరుద్రుఁడువలెఁ దారకాసురునిపై దండెత్తెను. అంతటఁ దారకాసురుఁడు చారులవలన గుహుని సాహాయ్యమున నింద్రుఁడు తనమీఁదికి దండెత్తి వచ్చుచున్నాఁడని విని మండిపడి చతురంగబలములతోఁ గూడ దేవసేన నెదుర్కొనెను.

రాక్షసాధిపతియగు తారకాసురుఁడు దేవేంద్రాదిదిక్పాలకులను నాగాస్త్రమునఁ గట్టివైచి వాయవ్యాస్త్రమున దేవసైన్యమునెల్ల పాతము గావించుచుండెను. రణపండితుండగు శక్తిధరుండు తనదర్శనమొసంగి యింద్రాదులను నాగపాశబంధవిముక్తులఁగావించి నాగాస్త్రమున వాయవ్యాస్త్రమును సంహరించి మాయా యుద్ధనిపుణుండగు తారకాసురునిపై కురికి యాతని వక్షస్స్థలము శక్తిప్రయోగముచే బ్రద్దలు గావించెను. తారకాసురుఁడు పర్వతశిఖరమువలె నేలపైఁగూలెను.

పిమ్మట దేవేంద్రుఁడు పరమానందమునఁ గుమారుని శ్లాఘించుచు దేవతలతోఁగూడ స్వర్గమునకుఁజేరి యథాపూర్వముగా నాధిపత్యము వహించెను



# మేఘసందేశము.

ఒక యక్షుఁడు కుబేరునియొద్ద నుద్యోగము చేయుచుండఁగా ఆతఁ డొకనాఁడు తనయధికారమునఁ బ్రమాదము నొంది తప్పుఁగావించెను. అందువలనఁ గుబేరుఁడు కుపితుఁడై యాతనికి శిక్షగా నొకసంవత్సరము భార్యావియోగ మనుభవించునట్లు శాప మిచ్చెను. యక్షుఁ డాశాప మనుభవించుటకుఁ జిత్రకూటాశ్రమములందు నివసించుచుఁ గొంతకాలము గడపెను. ఆషాఢశుద్ధ ప్రతిపత్తునాఁడు చిత్రకూటపర్వతపుఁ జఱియలయందు మేఘము దట్టముగ వ్యాపించి యుండెను. అప్పుడు విరహవేదనాభారమున నున్మత్తావస్థలో నున్న యక్షుఁడు ప్రావృట్సమయము సమీపించినది వియోగమునఁ గృశించిన నాభార్యకు నాక్షేమోదంతము బంపవలయు. లేనిచో నామె జీవింప దని మనమునఁ దలపోసి యామేఘమును జూచి మేఘుఁడా! నీవు లోకప్రసిద్ధములగు పుష్కలావర్తక మేఘముల వంశమునఁ బుట్టితివి. త్రిలోకాధిపతియగు దేవేంద్రునకుఁ బ్రధానపురుషుఁడవు. కామరూపుఁడవు. కావున నే నొక కార్యసిద్ధికొఱకు నిన్ను యాచించుచున్నాను. గొప్ప వానిని యాచించి కార్యసిద్ధిని బడయక పోయినను నది మంచిదియే. అధముని యాచించి కార్యసిద్ధిని బొందినను నది నీచాతి నీచము.

నేను కుపితుఁడగు కుబేరుని శాపముచేఁ బ్రియావియోగదుఃఖ మనుభవించుచున్నాను. నాసందేశమును నా ప్రియురాలికిఁ దెలిపి మాయుభయుల సంతాపమును నీవు వాప వలయును. నాప్రియురాలు "అలకాపురంబున" నున్నది.

దానికిఁ ద్రోవ చెప్పెదను వినుము. ఇచ్చటనుండి నీవుత్తరదిశ కరుగవలయును. మార్గమధ్యమున "ఆమ్రకూటము" అను నొక పర్వతము కలదు. అది మామిడిగున్నలతో నిండి ఫలపుష్ప పల్లవశోభావిశేషములు గలిగి కన్నులపండువై యుండును. నీవచ్చటఁ గొంతతడవు విశ్రమించి మార్గాయాసమును దీర్చికొని ప్రయాణమై నర్మదానదిలో స్వచ్ఛజలంబును ద్రావి యచటనుండి విదిశానగరమున కరిగి యందలి వైభవంబులను జూచి వేత్రవతీనదిలో నీరు గ్రోలి తత్తీరమున నున్న నీచైర్గిరి యందు విశ్రమింపుము. తిరిగి బయలుదేఱి యుజ్జయినీ నగరమున కరుగుము. అది తప్పక చూడఁ దగినది. అది యలకాపురమున కరుగు దారికిఁ బడమరట్టునఁ గొలఁదిదూరమున నుండును. దానికి నడుమ నిర్వింధ్యానది కలదు. అందలి చల్లగాలిచే మార్గాయాసము పోఁగొట్టుకొని యుజ్జయినికి బొమ్ము.

అందు సకలవస్తువిశేషములును మనోహరములగు నుద్యానవనములను గమ్మనితావులఁ జిమ్ము వలిగాడ్పులును సుందరములగు తామరకొలంకులును జిత్రకళావిశేషములును నీహృదయమున కానందము గలిగింపఁగలవు. అది భూలోకస్వర్గమను ఖ్యాతి గడించెను. అచట శిప్రయను నొకనది కలదు. దాని కనతిదూరంబున మహాకాలమను క్షేత్రరాజము గలదు. అచటఁ జండీశ్వరుఁడు ముఖ్యదైవము. అద్దేవుని దర్శించినవారియభీష్టములు తప్పక సిద్ధించుచుండును. నీవచటి కరిగి దేవదర్శనముచేసికొని సాయంకాలసేవయందుఁ బాల్గొనుము. పిదప గంభీరానది మీఁదుగా దేవగిరికిఁ బోయి యం

దుఁ బ్రసిద్ధదేవుఁడగు కుమారస్వామి నారాధించి రంతిదేవుని రాజధానియగు దశపురమున కంటె చర్మణ్వతీనదిని దాఁటి బ్రహ్మావర్తదేశము మీఁదుగాఁ గురుక్షేత్రమున కరుగుము.

అందు సమస్తపాపములను హరించు సరస్వతీనదిగలదు. దానిని సేవించుకొని గంగానదికిఁ బోయి తదారాధనమునఁ బవిత్రతను గాంచి యచటనుండి హిమవత్పర్వతమునకుఁ జేరుము. అది మహేశ్వరుని పాదస్పర్శమునఁ బరమపవిత్రమైనది. అన్నినగములలోఁ బేరెన్నికఁ గన్నది. నీవచ్చట విశ్రమింపుము. తరువాతఁ గ్రౌంచాచలమున కేఁగి యచటివిశేషములవలోకించి కైలాసపర్వతమునకుఁ బొమ్ము. అందుఁ బార్వతీపరమేశ్వరు లుందురు వారి దర్శనమున నీవు ధన్యాత్ముఁడవు కాఁగలవు. నీవాశైలమున నుండి కుబేరదిశకుఁ జూచినచో నలకానగరము కనఁబడును. అది యక్షేశ్వరులకు రాజధానియై సకలసంపదలతోఁ దులఁదూఁగుచు నమరావతిని మించియుండును. దానికి వెలుపల నొకయుద్యానము కలదు. అందుఁ జంద్రశేఖరస్వామి కలఁడు. అతఁ డప్పురమునకు భూషణము. ఆనగరమునఁ గుబేరుని భవనము కలదు. దానికి నుత్తరభాగమున మాగృహముండును. దానికి వెలుపల నొక క్రీడాశైలము కలదు. నీవు నేను చెప్పిన గుర్తులను బట్టి యా శైలమునకుఁ జేరి యచట విశ్రమించి నా ప్రియురాలిని గనుఁ గొనుము. ఇప్పుడామె భర్తృవియోగదుఃఖమున సొమ్ములు పెట్టుకొనక తల దువ్వుకొనక మంచిచీరలు కట్టక యలంకారహీనమగు

తాపముతో మిగులఁగృశించిన శరీరముతో దైన్యమును వెలిపుచ్చుచుండును.

అంతట నీవు నాప్రియురాలితో సాధ్వీ! నీభర్త చిత్రకూటాద్రియందుఁ గుశలమున నున్నవాఁడు. రాత్రిందివములు నీస్వప్నములతోడను నీప్రతికృతులతోడను గాలము గడుపుచున్నవాఁడు. నిన్ను స్మరింపని కాలము లేదు. ఇఁక నాలుగు మాసములు మాత్రమే మీకెడఁబాటు కలదు. ఈస్వల్పకాలమును గన్నులుమూసికొని యెట్లో కడపవచ్చును ధైర్యముతో నుండుము. నేను నీభర్తయొద్దనుండియే వచ్చుచుంటిని. అని చెప్పి తిరిగి నాప్రియురాలి కుశలోదంతము నాకుఁ జెప్పి నాజీవితము నిలుపుము. అని పలికెను. అంతటఁగామరూపుఁడగు మేఘుఁడు దౌత్యమున కంగీకరించి యక్షుఁడు చెప్పిన మార్గమున నలకానగరముఁ జేరి యందు యక్షునిప్రియురాలినిఁ గనుఁగొని యామెకు భర్తృసందేశమును దెలిపి సంతసింపఁజేసి మరలఁ జిత్రకూటశైలమునకు వచ్చి యక్షునకుఁ బ్రియాక్షేమవార్త నెఱింగించెను. యక్షుఁడు సంతోషముతో మిగిలిన మాసములు గూడ నచ్చటనే కడపి పిదప నలకాపట్టనమునకుఁ బోయి తన ప్రియురాలితోఁ గలిసికొని కుబేరుని యనుగ్రహము వడసి యథాప్రకారము గౌరవాధికారము లందెను. అంత నాయక్షదంపతులు పరమానందముతో సంసారసౌఖ్యము లనుభవించిరి.

# కిరాతార్జునీయము.



ద్వైతవనమునఁ బాండవు లరణ్యవాసము చేయుచుండు కాలమున నొకనాఁ డొకవనచరుఁ డచటికి వచ్చి ధర్మరాజునకుఁ బ్రణామముఁ జేసి భక్తివినయంబులు గదుర దోసిలొగ్గి మహాప్రభూ! నేను మీయానతి చొప్పునఁ గురుదేశములకరిగి దుర్యోధనుని ప్రవర్తనము నంతయుఁ గనిపెట్టి వచ్చితిని. యథార్థమును దెలుపుట చారుల ధర్మము. హితకరములగు పలుకులు ప్రియకరములు గావు నాపలుకులు కఠినములుగఁ దోఁచినను నవి పథ్యములుగ భావించి నన్ను క్షమింపవలయును.

—: వనచరుఁడు ధర్మరాజునకు దుర్యోధనుని వర్తనము దెలుపుట :—

దుర్యోధనుఁ డిప్పు డప్రతిహతముగ రాజ్యమును బాలించుచుండినను వనవాసముఁ జేయుచున్న నీవలన నెప్పటికైనను దన కుపద్రవము గలుగఁగలదని శంకించి ధర్మరాజుకంటె దుర్యోధనుఁడు మంచివాఁడని ప్రజలకు విశ్వాసము గలిగించినచో రాజ్యమంతయుఁ దనకు స్థిరముగ నుండఁగలదని యెంచి లేనిగుణములను దెచ్చిపెట్టుకొని భృత్యులను మిత్రులుగను మిత్రులను బంధువులుగను బంధువులను దనతో సమానులుగ రాజాధి

రాజులుగను గౌరవాదరములతోఁ జూచుచుఁ బ్రజల కనేకము లగు సౌకర్యములను గలిగించుచు నానాఁటికిఁ బ్రజానురంజకుఁ డగుచుండెను. రాజులలో గౌరవమును సంపాదించి వారలు తనశాసనమును బుష్పమాలవలె శిరములఁ దాల్చునట్లు వర్తింపఁ జేయుచుండెను. ఫలసిద్ధినిబట్టి యతని కార్యారంభముల నూహింప వలయునే కాని వేఱువిధమునఁ దెలిసికొన శక్యములుగావు. సామాద్యుపాయము లతనిచేతిలోఁ గీలుబొమ్మలు. అతఁ డెల్లని మిమ్ములను నశింపఁజేయ వలయునని యత్నించుచున్నాఁడు. కావున మీ రిఁక సంతోషమాత్రము నుపేక్షింపఁదగదు. తత్ప్రతీకారమునకుఁ దగిన యత్నము నొనరింపుఁడు." అని విన్నవించి యుధిష్ఠిరునివలన సత్కారములఁ బొంది స్వగృహమునకుఁ జనెను

## —: ద్రౌపదియభిప్రాయము :—

అంతటఁ బాండవాగ్రజుఁడు ద్రౌపదీభవనమున కేగి యచటఁ దమ్ములను ద్రౌపదినిఁ జూచి వారికి వనచరుఁడు దెచ్చిన వర్తమానము తెలిపెను. ద్రౌపదీదేవి యుధిష్ఠిరునితో, రాజేంద్రా! నేనాఁడ దానను. మీవంటివారియెదుట మాటలాడుట కెంతమాత్రమును దగను కాని నాహృదయావేగమును బట్టి పలుకఁ దలఁచితిని. మీవంశపారంపర్యమున వచ్చుచుండిన రాజ్యమును నీబుద్ధిపూర్వకముగ విడిచిపెట్టితివి. కవచములేని యుద్ధవీరుఁడు తీక్ష్ణశరంబులకు గుఱియగునట్లు కపటాత్ములయొద్ద

నిష్కపటముగ వర్తించు రూఘులు పరాభవములపాలగు చుందురు. ప్రారబ్ధవశమున గష్టములు ప్రాప్తించినపుడు సంతోషముతో ననుభవింపవచ్చును. కాని నాటివాడగు శత్రువు కల్పించిన కష్టముల నభిమానవంతులు సహింపజాలరు. ఉత్తమక్షత్రియవంశమునం బుట్టి పరాక్రమమును విడిచి దీనవృత్తికిం బాల్పడి భీమార్జునాది మహావీరులను సయితము నిర్వీర్యులం జేయుట యుక్తముగాదు. మానసీయులు నీవర్యులను గర్హించుచున్నారు కావున నీకన్నైనను పౌరుషమును వహించి శత్రువులను రూపుమాపి నీకీర్తిని నలుదెసల నింపుము. అని పలికెను.

—: భీమునియభిప్రాయము :—

అంతట భీమసేనుండు అగ్రజా! స్వల్పమగు సౌషధంబున నధికగుణము న్నట్లు స్వల్పమగు ద్రౌపదీవాక్యమున నధికార్థము కలదు. నాకామె పలుకులు కర్ణానందకరములుగ నున్నవి. మనము పౌరుషము నాశ్రయించి శత్రువుల నిర్మూలించి తెగటార్చుట యుక్తము. మనకు వారు నియమించిన వనవాసావధితో బని లేదు. మన మంతవఱకు నిరీక్షించి యుండినను బరమదుర్మార్గుడగు దుర్యోధనుడు చిరకాల మనుభవించిన రాజ్యసంపదలను విడుచుట కిష్టపడడు. ఒకవేళ నతడు మనపాలు మనకిచ్చినను నాటిచ్చపుమాటి శాసించినచో మన బాహుబలములు మనపౌరుషములును నిరర్థకము లగును. మాన

వంతున కుత్సాహశక్తి ప్రధానమైనది. అది ప్రభుశక్తికిఁ గూడ మూలకారణము. ఉత్సాహశక్తిగలవానికిఁ దనపౌరుషమే సకల కార్యములు సాధించుటకు ముఖ్యముగ సహాయపడును. ఆతని కన్యుల సాహాయ్యములు నిమిత్తమాత్రములు. తేజశ్శాలికిఁ బరాక్రమమున నార్జించిన జీవనమే జీవనము. మానధనునకు నస్థిరములగు ప్రాణములను విడచి స్థిరమగు యశస్సును సంపాదించుటయే ముఖ్యకార్యము. రాజ్యప్రాప్తి యానుషంగికఫలము. జనులు బూడిదని గాలఁ దన్నుదురు. ప్రజ్వలించెడి యగ్నిని జూచి భయపడుదురు. సింహము గర్జించెడి మేఘములను సహజముగనే పైకొనుచుండును. తేజశ్శాలులమగుమనము శత్రూదయమును జెవులార వినుచుఁ దత్కృతపరాభవములకుఁ గుందుచు నుండుటకంటె నీచాతినీచమగు కార్యము వేఱొకటి లేదు. కావున నీవిఁకనైనను బరాక్రమింపుము. కాలవిలంబము మంచిది కాదు. శత్రువు రాజమండలమును వశము గావించుకొనును.

ఇప్పుడెన్ని శత్రుబలముల నైనను జల్చి చెండాడుటకుఁ జండవిక్రములగు నీ నలుగురు తమ్ములును శక్తులై యున్నారు. అని క్రోధోద్రేకమునఁ బలికెను.

—: యుధిష్ఠిరుని యభిప్రాయము :—

ధర్మరాజు భీముని శాంతవాక్యముల నూరడించి భీమా! నీవు పలికిన పలుకులు యథార్థములు. కాని నాహృదయమున

పాలురుగూడ మనయందు మంచిభావము గలవారు. వారును వైరిపక్షము నవలంబించువారు కారు. బుద్ధిమంతుఁడు పరాత్ములగు శత్రువుల సంపదభ్యుదయములకుఁ గినియక రోగార్తుఁడై ఘోరకొండినచోఁ దప్పించఁబడలే వారిపాపవలనఁ గారణములుం గాఁగలవు, అని నీతివాక్యములు బోధించుచుండెను.

—: వ్యాసుఁడు అర్జునునకు మంత్రోపదేశము చేయుట :—

అంతలో వ్యాసమహర్షి యచటికి వచ్చెను. ధర్మరాజు బహుశ్రద్ధాభక్తులతో నమ్మునీంద్రున కర్ఘ్యపాద్యాదిసత్కారములాచరించి దైవికముగఁ బ్రాప్తించిన యమ్మహాత్ముని దర్శనమున కానందానందము నందుచు మహాత్మా! పుణ్యాత్ములకుఁగూడ లభింపని నీదర్శనము నేఁడు మేఘములేని వర్షము పగిది మాకు లభించినది. మాపూర్వపుణ్యములు ఫలించినవి. మేము ధన్యాత్ములము. మాకు సర్వమును జేకూరినది. నిష్పాపులగు మీదర్శనము మా కేశుభములు సమకూర్పఁ బ్రాప్తించినదో వినుటకుఁ గుతూహల ముదయించుచున్నది. అని పలికెను. పరాశరాత్మజుఁడు, రాజా! దుర్యోధనాదులు కపటోపాయమున మీరాజ్యమును దీసికొని మిమ్మిట్లు నట్టడవుల పాలొనరించుట శోచనీయముగఁ గన్పట్టుచున్నది. వారు కుత్సితమార్గమున మీరాజ్యము హరించినను మీరు క్షత్రధర్మానుసారముగ రణరంగమున శౌర్యమును జూపి రాజ్యమును

విశేషముల నర్జునునకుఁ దెలిపి వ్యాసమునీంద్రుని యుపదేశాను సారముగ నిశ్చలమనస్కుఁడవై తపము గావింపుము. మంచి కార్యము లాచరించునపుడు పలువిఘ్నములు కలుగుచుండును. నీవు వానిని లక్షింపక జాగరూకతతోఁ గార్యసిద్ధికిఁ గృషిచే యుచుండుము. అని బోధించి నిజావాసమున కేగెను. ధనంజయుఁ డింద్రకీలవనమధ్యమున నియమపాలనము చేయుచు గురూపదేశానుసారముగఁ జిత్తము నేకాగ్రముఁజేసి తీవ్రతపంబు సలుపఁదొడంగెను. క్రమక్రమమున నతని తపం బచిరకాలముననే పరిపక్వదశకు వచ్చెను. అప్పు డచ్చట నుండు వనపాలకులు దేవేంద్రునికడ కరిగి యతనికి నమస్కరించి దేవా! యింద్రకీలాచలమున నొకపురుషుఁడు ఘోరతప మొనరించుచున్నాఁడు. అతఁడు ధనుర్బాణాదులు ధరియించి జటాభిలాషమున నున్నట్లు చూపట్టుచున్నాఁడు. అతఁడు ఋషివంశజుఁడని కాని రాక్షసకులసంభవుఁడని కాని క్షత్రియాన్వయుఁడని కాని మేము నిర్ణయింపఁజాలము. కాని యతనియందు మహాపురుషలక్షణములు గలవు. ఇప్పు డతని తపఃప్రభావంబునఁ గ్రూరమృగములు సయితము పరస్పరవైరములు విడిచినవి. ఋతుభేదములు లేక సకలపాదపంబులును బుష్పించుచున్నవి. సర్వదా సుగంధవాతపోతములు వీచుచున్నవి. అంతటను మనోహరముగ బ్రకృతిలక్ష్మి తాండవ మాడుచున్నది. ఆకసము నిర్మలముగ నున్నది. భూతగణము లతనికి సేవలు

పలుపుచున్నవి. ఈవిషయమును దేవరసన్నిధిని విన్నవించు టకు మేమిటకు వచ్చితిమి. అని పలికి తదాజ్ఞను గైకొని వెడ లిపోయిరి

అమరేంద్రుడు వనపాలకుల పలుకులవలన నత్తపస్వి తన నందనుడగు పార్థుడని గ్రహించి సంతసించి హృద్గతాభి ప్రాయమును వెలిపుచ్చక యప్సరసలను రావించి యింద్రకీల మున నుండు తపస్విసమాధి కంతరాయములు గలిగింపుడని యాజ్ఞాపించెను. అప్సరస లుత్సాహముతో శీఘ్రముగ నింద్ర కీలవనమునకరిగి యచటఁ దపోనిష్ఠాగరిష్ఠుడగు పార్థుని సమా ధినుండి తొలఁగించుట కనేకవిధములగు శృంగారచేష్టలు గావించియు నతని నెంతమాత్రమును జలింపఁజేయలేక తుదకు విఫలమనోరథలై తదవమానమునకు సిగ్గుఁజెంది చేయునదిలేక యింద్రునికడకు వచ్చి తద్వృత్తాంతము నతని కెఱుకపఱచిరి.

—• ఇంద్రుఁడు అర్జునునకుఁ బ్రత్యక్షమగుట. •—

అంతట దేవేంద్రుఁడు వృద్ధమునివేషముఁదాల్చి యర్జు నుని యాశ్రమమున కరుదెంచి యతనిసపర్యలను బరిగ్రహించి యాసనాసీనుఁడై తనబ్రహ్మవర్చసము చే నచ్చెరువము బుట్టిం చుచు తాపసా! నీవు నవయౌవనముననే విరక్తితో నిట్టిగాఢ తపం బారంభించితివి. నాకిన్నియేండ్లు గడచియు నింకను గోపయాభిలాషము తగ్గుట లేదు. నీదేహసౌందర్యమునకు

న్నను దుచ్ఛఫలంబుల ననుభోగించుకొనుట స్వచ్ఛజలంబును పంకమున మలినము గావించుటయని యెఱుంగుము. శ్రేయః ప్రతిబంధకములును నతిచంచలములును నగునర్థకాములను శాసించి తపస్సును బాడుచేసికొనకుము. రణోత్సాహమును విడువుము. పరమార్థము నాశింపుము. అంతశ్శత్రువులను జయించి ప్రపంచమునంతయు జయించినవాఁడవు కమ్ము. అంతశ్శత్రువులను జయింపలేనివాఁడు వృషభమువలె పుత్రదారులకు దాస్యమొనరించుచుండవలయును. జాహ్నవీజలము చేఁ బరమపవిత్రమగు శ్రీశైలమునందే తపోధనుండవగు. నిన్ను ముక్తికాంత వరింపఁగలదు. శస్త్రమును విడువుము శాంతిని బూనుము. అని బోధించెను.

అంతట నర్జునుఁడు తాతా! నీయుపదేశములు యథార్థములు. సందియము లేదు. కాని యూషరక్షేత్రమున నాటిన విత్తనములవలె నస్థానమగు నాయెడల నీవు చేసినయుపదేశములు నిరర్థకములు. నేను క్షత్రియకులమున జన్మించితిని. పాండురాజునకుఁ దనయుఁడను. ఉత్తరకురుదేశములను జయించి ధనమును దీసికొని వచ్చినందున నాకు ధనంజయుఁడను పేరు వచ్చినది. నాయన్నయగు ధర్మరాజును దాయాదులు కపటద్యూతమున నోడించి మారాజ్యమును హరించిరి. శత్రుజయార్థము వ్యాసమహాముని నాకింద్రమంత్ర ముపదేశించి యీశైలమునఁ దప మాచరింపుమని శాసించెను. శత్రువులు

మాకొనరించిన యపకారములును వారు మాయెడఁ బ్రవర్తించిన నీచవర్తనమును నాహృదయమునఁ గోపానలమును రగుల్కొల్పుచున్నవి. మాకు వారొనరించిన యవమానమునకుఁ బ్రతీకారము చేయఁజాలకపోతినేని నాజీవితము వ్యర్థము. మానహీనుని బ్రతుకు తృణసమానము. భూపతి మానమును గాపాడుకొను నంతకాలమును గీర్తిని నైశ్వర్యములను నార్జించి భూమికి రాజన్వతీవాచకమును సార్థకము చేయఁగలఁడు.

నే నిప్పుడు సముద్రతరంగములవలెఁ జంచలములగు నర్థకామసుఖముల నాసించుటలేదు. శాశ్వతానందరూపమగు మోక్షముఁ గోరుటలేదు. శత్రువులను సంహరించి మాకీర్తికిఁ గలిగిన కళంకమును బాపుకొనవలెనని గాఢముగ నభిలషించుచున్నాను. వైరివర్గమును దెగటార్చి వంశలక్ష్మి నుద్ధరింపక మోక్షప్రాప్తికిఁ బ్రయత్నించుటెట్లు? అరివర్గము లపహరించిన కీర్తిని దిరిగి సంపాదింపలేని వాఁడు జీవన్మృతుఁడు. శత్రువులను హతముగావింపక క్రోధము నుపశమింపఁ జేసికొనువాఁడు పురుషుఁడని చెప్పుటెట్లు? అదియుంగాక యాశ్రమక్రమము ననుసరించి గృహస్థాశ్రమమున నున్న నేను జననియు నగ్రజుండును నుండ వారి యనుమతిలేక వానప్రస్థాద్యాశ్రమాంతరముల స్వీకరించుటెట్లు? అట్లాశ్రమాంతరముల నందక బ్రహ్మపదమునకు యత్నించుటెట్లు? నీవె వచింపుము. నేను స్వధర్మమగు క్షత్రియధర్మము ననుసరించి యుద్ధమున శత్రువులను జయిమా

ర్చుటయే ప్రస్తుతకృత్యముగ నిర్ణయించికొంటిని అని గంభీరము
గఁ బలికెను.

అంతట వృద్ధమునిరూపమునమున్న దేవేంద్రుఁడు స్వస్వ
రూపమునఁ బ్రత్యక్షమై యాపంచాశిశయమునఁ గుమారునిఁ
గౌఁగిలించుకొని ధనంజయా! నీతపమునకు మెచ్చితిని. ఇఁక
నీశ్వరునిఁగూర్చి తపం బాచరించి యతని ప్రత్యక్షుని గావిం
పుము. అప్పుడు నీవు నాక్రమ మఱితపముగఁ బ్రకాశింపఁ
గలదు. దిక్పాలురుకూడ నీకుఁ దగిన వరములను బ్రసాదింపఁ
గలరు. అని శాసించి తా నంతర్హితుం డాయెను.

ఈశ్వరుఁడు సిద్ధమునుల నోదార్చుట.

పాండవమధ్యముఁడు వాసవవచనానుసారముగ మహే
శ్వరునిఁగూర్చి తీవ్రతపంబు నలుపఁదొడఁగెను. క్రమక్రమ
మునఁ దత్తపోజనితంబగు తాపము హెచ్చి యచటి సిద్ధమును
లను దహింపఁజొచ్చెను. వా రాయగ్నికల్పమగు తేజమునకుఁ
దాళఁజాలక పరమేశ్వరుని దరి కరిగి యతని కీవృత్తాంతముఁ
దెలిపి మమ్ము రక్షింపవలయునని మొఱవెట్టిరి. దయాళువగు
శంకరుఁడు వారియెడలఁ బ్రసన్నుఁడై మునులారా! చతురాన
నుని ప్రార్థనవలన నధర్మపరులగు దురాత్ములను సంహరించుట
కిప్పుడు నరనారాయణు లిరువురును భూలోకమున నవతరించి
యుండిరి. వారిని కృష్ణార్జునులని వ్యవహరింతురు. వారిలో

నరాంశసంభూతుఁడగు నర్జునుఁడే యిప్పుడింద్రకీలమున దపస్సు చేయుచున్న పురుషుఁడు. అతఁడు బదరికాశ్రమమున నివసించు వాఁడు.

అతఁడు దురాత్ములును మహావీరులు నగు శత్రువులను రూపుమాపుటకు నన్నారాధించుచున్నాఁడు. అతఁడు దేవకార్యము నిర్వహింపనున్నాఁడని తెలిసికొని మూకదానవుఁ డిప్పు డేకాంతమునను న్న యతని జంపుటకు వరాహరూపముఁ దాల్చి తదాశ్రమమునకుఁ బోవనున్నాఁడు. కావున నేనుగూడ నిపు డచటికిఁ ద్వరితముగాఁ బోయి నా బాణమున నే ముందుగాఁ దత్సూకరమును వధించెదను. పార్థుఁడును దన శరమును విడిచి వచ్చి దానిని జంపి తనయమ్మునే తద్భూదారము చచ్చిన దనుకొని నేనే చంపితినని నాతోఁ గలహించును. పిదప నాతనికిని నాకును యుద్ధము జరుగఁగలదు. అతని రణకౌశలము చూపి నా కత్యాశ్చర్యము కలిగించి నాకు సంతృప్తిని గూర్పఁగలఁడు. తోడనే మీయుపద్రవము తొలఁగును. భయపడకుఁడు. అని వారి నోదార్చి తాను కిరాతనృపతి వేషముఁ దాల్చి ప్రమథగణములను గూడఁ గిరాతరూపములఁ దాల్చునట్లాజ్ఞాపించి వారిని సైన్యముగఁ జేసికొని తాను సేనాపతియై మృగయావ్యాజమున బయలుదేఱి ధనంజయుని యాశ్రమసమీపమున కేగి చెట్లచాటున దాఁగియుండెను.

## లీలాకిరాతార్జునయుద్ధము.

అంతట నొక యడవిపంది యర్జునునియొద్దకి చివ్వచివ్వున బరువెత్తుచుండెను. అది కరాళదంష్ట్రిలు గలిగి భయంకరాకారముతోఁ గ్రోధములపుంజమువలె నుండెను. ఫల్గుణుఁడా వరాహమును జూచి తద్దైత్యుఁ గనిపెట్టి యని తన్నుఁ జాపుటకు వచ్చుచున్నదనియు దానిని వధింపక పోయినచోఁ దనకు హాని తప్పదనియు నిశ్చయించుకొని తనధనుస్సున బాణమెక్కుపెట్టి కొట్టుటకు సిద్ధపడియుండెను. అంతలోఁ జెట్లచాటున లీలాకిరాతవేషమున నున్న శంకరుఁడు తన శరమును విడిచి యాక్రోడమును నేలఁ బడఁగూల్చెను. అర్జునుఁడును నాసమయముననే తన శరంబును గూడ నాసూకరముపైఁ బ్రయోగించి వెంటనే దానికడకుఁ బోయి తద్దేహమున నాటుకొనియున్న బాణము నూడబెఱుకుకొనెను.

అంతలో లీలాకిరాతుని యొద్దనుండి యొక ధనుర్ధరుఁడగు వనచరుఁ డరుదెంచి పార్థునిఁ గాంచి తపోధనా! నీయాకారము నీశమదమపరాక్రమాదిగుణములను జెప్పకయే చెప్పుచున్నది. కాని నీకృత్యము వేఱువిధముగ నున్నది. ఈవరాహమును మాప్రభువు తనబాణమున సంహరించెను. ఇది మా వస్తువు. దీనిపై బాణమును నీవెట్లు తీసికొనిపోయెదవు? నీకిది ధర్మమా? మీవంటి మహానీయులే యిట్టి దుష్కార్యములఁ

పలుపుటకుఁ బూనినచో నింక సామాన్యమానవుల విషయమునఁ జెప్పవలసిన దేమున్నది ? పరుని విశిఖము నిట్లు దొంగిలించుట యెంత తుచ్ఛకార్యము ? నీకిది లజ్జాకరముగ లేదా ? మా ప్రభువు దయఁదలఁచి యకాలమృత్యువువలె నీపైఁ బడి నిన్నుఁ జంపుటకు సిద్ధముగ నున్న క్రూరవరాహమును సంహరించి నీప్రాణములు కాపాడినందులకు నీవు చేసిన ప్రత్యుపకార మిదియా ? యీభయంకరమగు వనవరాహమును మా చమూపతిదప్ప నొక్కబాణమున హతము గావింపఁగలవాఁ డన్యుఁ డెవ్వఁడు కలఁడు ? మా ప్రభువు సకలాస్త్రముల నెఱింగినవాఁడు. మహావీరుఁడు. ఇంద్రుని యాజ్ఞచే నీవనప్రాంతములు రక్షించుచున్నాఁడు. నీ వేకాకివి. అతని శరమతని కిచ్చి మైత్రిని సంపాదించుకొనుము. నీకు శ్రేయము కలుగును. అని పలికెను.

అంతట నర్జునుఁడు కలఁతనొందని చిత్తముతో వనచరుఁడా ! నీపలుకులు స్వామిభక్తిపూరితములు. నీధర్మము నీవనుష్ఠించితివి సంతసించితిని. నేను పరుల బాణము నపహరించు నంతటి నిర్వీర్యుండను గాను. ఖాండవవనదహనసమయమున నసంఖ్యాకములగు బాణము లితరుల కొసంగి యుంటిని. దేవతల శరములను సయితము నేను లెక్కించువాఁడను గాను. ఇంక నొకకిరాతుని బాణమున కేనాసింతువా ! యీయడవి పంది యొక్కక్షణములో హతమైనది. మే మిరువురమును

శరములను బ్రయోగించితిని. ఆ దేవరిబాణము మొదట బడినదో నిర్ణయించు టెట్లు? నిర్ణయము లేక యిది మా వస్తు వని కలహించుట న్యాయమా?

మఱియొకమాట విరాయుధుఁడగు వానిని దయఁద లఁచి రక్షింపవచ్చును గాని సాయుధుఁడనగు నన్ను మీప్ర భువు దయఁదలఁచుట పరిహాసాస్పదము. మఱియు మేము వర్ణాశ్రమాచారరక్షకులము. క్షత్రియవంశజులము. మీరు మృగహింసాజీవనులు. కిరాతకులము వారలు. మా భావముల మీ భావములకు నెంతమాత్రము సంబంధముండదు. ఏనుఁ గులకును నక్కలకును నెట్టి సాదృశ్యము కలదో మాకును మీకును నట్టి సామ్యము కలదు. కావున మనకు మిత్రత్వము పొసఁగుట గగనకుసుమసదృశము. నీ వింతవఱకును బలికిన నిందావాక్యములను క్షమించితిని. నాయొద్ద నున్న బాణము ను బరిగ్రహింపనెంచుట విషసర్పశీర్షమున నున్న మణిం హ రింపఁ దలఁచుటయని మీ ప్రభువుకుఁ జెప్పుము. పొమ్ము అని గంభీరముగఁ బలికెను.

కిరాతుఁ డాపలుకుల నుగ్రుఁడై నట్టి రణమునకు సిద్ధముగ నుండుము. అని భీషణముగఁ బలికి వెడలిపోయెను. అంతట లీలాకిరాతుఁడు సైన్యముతో వచ్చి ధనంజయుని దాఁ కెను. వారిరువురకును ఘోరమగు పోరు జరుగుచుండెను.

అంతఁ గొంతకొడుకైన యర్జునుఁడు తన యుద్ధనైపుణ్యమంతయు వ్యర్థమగుచుండుట గ్రహించి పూర్వము నేనొనరించిన ఘోర యుద్ధములలో నిదియొక సమరమని చూడఁ దలంచుటకు వీలు లేదు. దీనియందు రణరంగమున శిక్షితములగు హయగజాదులను దగిన యాయుధములును రథాదులును సత్యల్పసంఖ్యాకములుగ నున్నవి. యోధులును స్వల్పసంఖ్యాకులే యైనను నాశక్తి విజృంభించుటకు బదులు క్రమక్రమముగ క్షీణించుచున్నది. ఈవనచరాధిపతి పరాక్రమమున మిక్కిలి విజృంభించుచున్నాఁడు. ఈతని ధనుర్నాదము రోదసీకుహరమును బ్రద్దలు చేయుచున్నది. ఇతని రణకౌశలము భీష్మద్రోణాది మహావీరుల యందైనను గనిపింప లేదు.

ఆహా! యిట్టి శరలాఘవము మానవమాత్రులయందెచ్చటను గనివిని యెఱుఁగను. ఇతఁడొక కిరాతకుల సంజాతుఁడని చెప్పవలనుపడదు. ఈతని వైఖరి చూడ నాకత్యద్భుతముగఁ దోఁచుచున్నది. అని వితర్కించుకొనుచు ధైర్యముతోఁ దానాతనికిఁ దగ్గఱ యస్త్రయుద్ధము చేయు నారంభించెను. లీలాకిరాతుఁ డర్జునుని ధనుర్బాణములను గవచమును ఖండించెను. అర్జునుఁ డుత్సాహమును విడువక బాహుయుద్ధమున నతఁ డమితముగఁ బోరఁ దొడంగెను.

—: అర్జునుఁడు వరములువడసి ద్వైతవనమునకుఁ జేరుట :—

అంతటఁ బరమేశ్వరుఁడు పార్థుని పరాక్రమమునకు మెచ్చికొని కిరాత వేషమును విడిచి స్వస్వరూపమునఁ బ్రత్య

క్షమాపెను. తోడనే యర్జునుఁడు శివునకు సాష్టాంగవందన మొనరించెను. అంతలోఁ గవచమును ధనుర్బాణములను యథాప్రకారముగఁ దనదేహమున నుండుటను జూచిగాని పార్థుఁడు మిగుల విస్మయమునుపొందెను. ఆసమయముననే యింద్రాదిదిక్పతులు జయజయధ్వానములతో విమానములనుండి యచట దిగిరి.

అర్జునుఁడు భక్త్యతిశయంబున మహాసముంబమోక్షి పరమేశ్వరునిఁ బ్రస్తుతించి నేను నీమొదట నజ్ఞానమునఁ బలికిన యవిచారములను క్షమింపవలయునని వేఁడుకొనెను. మహేశ్వరుఁడతనిభక్తిశక్తులకు మెచ్చుకొని వరమును కోరుకొమ్మని యడిగెను. అర్జునుఁడు ధర్మపరాయణా! శత్రునిగ్రహమును జయించుటకు సమర్థమగు శస్త్రసంపత్తిని బ్రసాదింపుమని కోరెను. పరమేశ్వరుఁడతనికిఁ బాశుపతాస్త్రమును ధనుర్వేదము నంతయు నుపదేశించి యంతర్ధాన మందెను. దిక్పాలకులును దమతమ యస్త్రముల నర్జునున కొసఁగి యాశీర్వదించి యథేచ్ఛం జనిరి. అంతట నర్జునుఁడు దివ్యాస్త్రలాభమును బొంది ద్వైతవనమున కేగి యన్నయగు ధర్మరాజునకు నమస్కరించి తన వృత్తాంతమంతయు నివేదించి యానందరసాబ్ధి నోలలాడించెను.



# శిశుపాలవధము.

మేదినీమండలమున కలంకారమగు ద్వారకానగరమున నొకానొకసమయమందు శ్రీకృష్ణుఁడు తనభవనమునందు సుఖాసీనుఁడై యేకాంతంబున లోకక్షేమము నాలోచించుచుండెను. అప్పు డచటికి దేవలోకమునుండి విష్ణుసంకీర్తనము చేసికొనుచు నారదమునీంద్రుఁడు వచ్చెను. శ్రీకృష్ణుఁ డామహర్షిని బూజించి స్తోత్రములు చేసి తదాగమనప్రయోజనము నడిగెను.

ఇంద్రసందేశమును నారదుఁడు శ్రీకృష్ణున కెఱింగించుట.

దేవర్షి, ఉపేంద్రా! యింద్రుఁడు నీ కొకసందేశ మంపినాఁడు. అది వినుము. పూర్వము హిరణ్యకశిపుఁ డను రాక్షసేంద్రుఁడు కలఁడు. అతఁడు త్రిలోకాధిపతులగు దేవతలను బలువిపత్తులపాలుచేసి వారి యైశ్వర్యములను హరించి లోకములను బీడించుచుండెను. అప్పుడు నీవు నరసింహరూపమున నవతరించి యతని నఖములఁ జీల్చి చంపితివి. తిరిగి యాదైత్యుఁడు రాక్షసకులంబున విశ్రవసునకు రావణుఁ డనుపేరుతో జన్మించెను. ఆరావణుఁడు మూఁడులోకములను దా నధిపతి

కావలయునను దృఢసంకల్పముచే నట్టిశక్తి నొసంగు పరమేశ్వరుని ప్రీత్యర్థము తన తొమ్మిది శిరస్సులను ఛేదించి యథాక్రమమున నగ్నికుండమున హోమము చేసి పదియవ శిరంబునుగూడ నతిసాహసోత్సాహములతో ఖండించుటకు సిద్ధపడియుండెను. అంతలోఁ జంద్రశేఖరుఁడు ప్రత్యక్షమై యతఁడు కోరిన వరముల నిచ్చెను.

పిదప రావణుఁ డప్రతిహతశక్తిసంపన్నుఁడై బాహుబల గర్వమునఁ గైలాసగిరి నెత్తెను. స్వర్గపురికి వచ్చి మహోగ్రతర యుద్ధమునఁ బ్రహరించి హిమవత్పర్వతగుహాంతముఁ బాఱఁద్రోలెను నందనవనమును బాడుచేసి సురాంగనలను జెఱపట్టి స్వర్గపురమునకుఁ దీఱనిదుఃఖము కలిగించెను. కుబేరుని జయించి శంఖనిధిని పుష్పకవిమానమును దీసికొనిపోయెను. వరుణుని రణమున నోడించి స్వాధీనునిఁ జేసికొనెను. యమధర్మరాజును భంగపఱిచి తలయెత్తకుండఁ జేసెను. సూర్యుని భయపెట్టి గ్రీష్మఋతువునందు నయితము తైక్ష్ణ్యము వహింపకుండఁ జేసెను. చంద్రునిఁ బీడించి సకలరాత్రులందును దన లంకానగరమును బ్రకాశింపఁజేయునట్లు శాసించెను. అగ్నిని వాయువును దన తేజోవిశేషమున గడగడలాడించి తనకు సేవకులనుగ నొనరించుకొనెను. వీరు వారని చెప్పనేల? లోకత్రయమును బీడించి స్వవశముగఁ జేసికొనెను.

తుదకు శ్రీమహావిష్ణుండవగు నీవు శ్రీరామావతారమున నుండ నీభార్యయగు జానకిని గూడ నపహరించెను. నీవపుడు సముద్రమునకు సేతువుగట్టి లంకాపురి కేగి సమూలముగ నారావణాసురుని సంహరించితివి. ఆ రావణుండిప్పుడు నటుండు వేషాంతరమును దాల్చినట్లు శిశుపాల నామమునం దిరిగి జనియించెను. శిశుపాలుండు బాల్యమున నాలుగు బాహువులును మూండు నేత్రములును గలిగియుండెను అతనికి యాదవ మంకురించినతోడనే యా యధికావయవము లంతరించెను. అతండిప్పుడన్ని లోకములను జయించి వానిని దననిగ్రహానుగ్రహములకుం బాత్రములుగం జేసికొని పూర్వజన్మములందు వలె నాసురభావమున మిక్కిలి బాధించుచున్నాండు పతివ్రతయగు పతి జన్మాంతరములందును దన భర్తనే కలిసికొనునట్లు పూర్వజన్మవాసనాబలము భవాంతరములందును జీవుని విడువకుండుట సహజము. అతని దుష్కృత్యము వర్ణింప నలవి కాదు. నీ కతని విషయము తెలియనిది కాదు. ప్రపంచమును దుష్టులాక్రమించి పీడించుచున్నపుడు విశ్వంభరుండవగు నీకు దుష్టశిక్షణమును శిష్టరక్షణమును నవశ్యానుష్ఠేయములు. అంధకారము లోకమును నాక్రమించి మలీమసముగం జేసినపుడు భాస్కరుండాచీకట్లను భేదింపనిచో నన్యుండెవ్వండా కార్యము నిర్వర్తింపంగలండు?

కావున దేవా! నీవా శిశుపాలుని సంహరించి లోకములను రక్షింపవలయును అని పలికెను. శ్రీకృష్ణుండు తద్వచన

ములకల్లే యని యంగీకరించెను. బ్రహ్మసూనుఁడు దేవకార్యము నెఱవేర్పఁగోరి నభోమార్గమున యథేచ్ఛం జనియెను. గోవిందుఁడు చైద్యునిమీఁదికి దండయాత్ర వెలువడుట కాలోచింపఁ దొడఁగెను. అంతలో నింద్రప్రస్థనగరమున ధర్మరాజు రాజసూయయాగము చేయఁబోవుచున్నాఁడు. శ్రీకృష్ణుఁడు రావలయును. అని వాసుదేవున కాహ్వానము వచ్చెను.

—• శ్రీకృష్ణుఁడు ఉద్ధవబలరాములతో నాలోచించుట. •—

అప్పుడు శ్రీకృష్ణుఁడు ఉద్ధవబలరాములతో రహస్యాలోచనభవనమున కరిగి వారిం గాంచి నయజ్ఞులారా! నారదమౌని శిశుపాలుఁడు లోకముల కొనర్చెడి మహాపరాధములను వివరించి యతని రూపు మాపవలయునని వాసవసందేశముగ నా కాజ్ఞాపించెను. నేనందుల కంగీకరించితిని. చైద్యుఁడింకను ప్రాణములతో నుండినచో లోకములు నిలువఁ జాలవు. లోకరక్షణము మనకవశ్యాచరణీయము. ఇది యిట్లుండ యుధిష్ఠిరుఁడు రాజసూయయాగము చేయఁబోవుచున్నాఁడనియు వెంటనే నన్ను రమ్మనియు వార్త వచ్చినది. ఇప్పుడు యాగమున కరుగుట యుక్తమా? దండయాత్ర కేఁగుట యుక్తమా? యీ రెంటిలో నేకార్యమున కావశ్యకత కలదో తోఁపక సంశయాకులితచిత్తుఁడనై యుంటిని.

ధర్మరాజు జయశీలులగు తమ్ముల సాహాయ్యముతో సకలమహీపతులను సామంతరాజులఁగఁ జేసికొనెను. నేను లేకపోయినను ప్రస్తుతయాగము నతఁడు చక్కఁగ నెఱవేర్చుకొనఁగలఁడు. శత్రువుగాని రోగముగాని యభివృద్ధిచెందుచున్నపుఁ డెంతమాత్రము నుపేక్షింపరాదు. వానికొక్కని కపకారము కలిగినచో నది సహింపవచ్చును గాని యనుక్షణమును లోకములకు మహోపద్రవములను దెచ్చిపెట్టు పరమదురాత్ముని నొక్కమహూర్తకాలమైనను బ్రాణములతో నిలువనిచ్చుట యుక్తము కాదనియుఁ బ్రకృతము దండయాత్రయే ముఖ్యకార్యమనియు నాకొక యూహ పొడమినది. దీనిలో నయశాస్త్రవిదులగు మీయభిప్రాయము లేవియో తెలిపి సంశయవిచ్ఛేదమును జేయుఁడు. అని యడిగెను.

## — బలరాముని యభిప్రాయము —

అంతట బలరాముఁడు కృష్ణా! శిశుపాలుఁడు మొదటనుండియు మనకు శత్రువర్గములోని వాఁడు. నీవు నరకాసురుని వధించుట కరిగినప్పుడు ద్వారకాపురమును ముట్టడించి పౌరులనందఱను బీడించెను, రుక్మిణిని హరించుటకు యత్నించెను, మఱియు నెన్నియో యపకారము లొనరించెను. అతఁ డిప్పటికిని ద్రోహబుద్ధితో నున్నాఁడు. రోషకలుషితుఁ డగు శత్రువుతో విరోధించియు నెవ్వరుదాసీనులై యుందురో వారు

గడ్డిపొదయం దగ్నిని బ్రజ్వలింపఁ జేసి దానియొద్ద గాలి తెమరుగఁ బరుండి నిద్రించువారని చెప్ప నొప్పును. బుద్ధిమంతుఁడు ద్విగుణీకృతోత్సాహముతో నరివర్గములఁ జెండాడుచుండవలయు. నీతివిదుఁడు సర్వదా తన యభివృద్ధికిఁ బాటు పడుచు శత్రువును హీనస్థితిలో నుంచుటకు యత్నించుచుండవలయు. నీకిపుడు దండయాత్ర సలుపుటకుఁ దగిన పరిస్థితుల న్నియు సిద్ధముగ నున్నవి. ఇఁక నాలసించినచో మనమంత్ర రహస్యము దాఁగనేరదు. దాన ముప్పు వాటిల్లఁదగదు. కావున శీఘ్రముగ దండయాత్ర కేగుటయే శ్రేయమని నామతము అని వచించెను.

—॰ ఉద్ధవుని యభిప్రాయము ॰—

అంతట నుద్ధవుఁడు జనార్దనా! కేవలోత్సాహముకలవార లల్పకార్యమును సాధించుటకు బహుప్రయాసములఁ బాలగుదురు. ప్రజ్ఞకలవారు గొప్పకార్యము లారంభించియు సులభముగ సిద్ధిం బడయఁగలరు. నయజ్ఞులు మంత్రోత్సాహశక్తులను రెంటిని సమానముగ వార్జించి యేకార్యము నేని విమర్శించి యాచరింతురు. కాని త్వరపడరు. సమరమన సామాన్యకార్యము కాదు. జయాపజయముల నిర్ణయించుట బహుకష్టసాధ్యముగు పని. అన్నిటిలో, గాలపరిపాకమున కెదురు చూచుచుండుట ప్రథమకర్తవ్యము. నీ విపుడు తలవని తలం



పుఁ జైద్యునియొద్దకి దాడి వెడలుట మంచికార్యము
కాదు. అతం డేకాకియని తలంపవలదు. అనేకరోగముల
సమష్టిరూపమగు క్షయరోగము వగిడి వతఁ డనేక దుష్టభూ
పాలుర సమష్టిరూపమని గ్రహింపవలయు. అతనికిఁ గాలయ
వన శాల్వ రుక్మి ద్రుమ బాణాది క్షోణీపాలురు ముఖ్యముగ
సహాయభూతులగుదురు. అతఁడు జగదేకవీరుఁడని ప్రసిద్ధి వడ
సినవాఁడు.

కావున నీవిపుడు సకలసన్నాహము లొనరించుకొని
యుధిష్ఠిరుని రాజసూయమున కరుగుము. అచ్చటికి రాజమండ
లమంతయును రాఁగలదు. దానిలో మనకనుకూలు రధికసం
ఖ్యాకు లుందురు ధర్మరాజు భక్తివిశేషమున ముందుగ నిన్నుఁ
బూజింపఁగలఁడు. అప్పుడు నీప్రతిపక్షులగు శిశుపాలాదు
లేకీభవించి నీయందలి మాత్సర్యమున గలహింతురు. అంతట
మీబంధువులును నీమిత్రులును నీపక్ష మవలంబింతురు అరి
వర్గములోఁ గూడ సమయానుకూలముగఁ గొంద ఱుదాసీను
లుగ నుందురు. అప్పుడు శత్రుపక్షము బలహీన మగును.
నీవంతట శిశుపాలుని సులభముగఁ దెగటార్పఁ గలవు. ఇది
నాయభిప్రాయ మనఁ బలికెను.

—: శ్రీకృష్ణుఁడు రాజసూయమున కరుగుట. :—

అంతటఁ గృష్ణుఁడు వారియుభయులభిప్రాయములు విని
కులవృద్ధుఁడగు నుద్ధవుని యాలోచన గ్రాహ్యమని నిర్ణయించి

కొనివారల యనుమతింబడసి ఛత్రచామరాదిరాజచిహ్నములు ధరించి రథారూఢుఁడై బంధుమిత్ర సేనాపరివారముతోఁ బ్రయాణమై పోవుచుండెను. మార్గమధ్యమునఁ బుష్పలతా పల్లవపాదపముల శోభాతిశేషములచే మనోహరమగు రైవతక మహీధరమునందు విడిసి యాదిన మచటఁ గడపి రెండవదినమునఁ దిరిగి బయలుదేఱి యమునానదిని దాఁటి యింద్రప్రస్థనగర సమీపమునకుఁ జేరెను. ధర్మరాజు పరివారముతో నెదురేగి శ్రీకృష్ణునిఁ దోడ్కొని వచ్చి సభాభవనమున నాసనోపవిష్టునిఁ గావించెను. అచ్చట వేదఘోషములు గావించుచుండెడి బ్రాహ్మణోత్తములను మంత్రక్రియాచణులగు ఋత్విజులను ధర్మకార్యనిరతులగు మహీపాలురను గనుంగొని శ్రీకృష్ణుఁడు మిగుల నానందించుచుండెను.

### ధర్మరాజు శ్రీకృష్ణున కగ్రపూజ చేయుట.

అప్పుడు ధర్మరాజు శ్రీకృష్ణునిఁ గాంచి దోసిలొగ్గి దేవా! కృషీవలుఁడు ధాన్యరాశిని సిద్ధము చేసికొని వాయువున కెదురు చూచుచుండునట్లు నేను యజ్ఞమునకుఁ గావలసిన వస్తుజాలమునంతయు సమకూర్చుకొని నీరాకకుఁ బ్రతీక్షించుచుంటిని. నీవు లేనిచో నీకార్యము నిర్వహించుటెట్లు? నీయనుగ్రహంబుననే లోకములకు మేలుకలుగవలయును. జగద్రక్షకుండవగు నీయాగమనమున నాయధ్వర మవిఘ్నముగ నెఱవేఱ

గలదు. దివాకరుఁ డుదయించిన పిదపఁ బగటికిఁ గలిగెడి ప్రకాశమును దొలఁగించుట కెవ్వనితరము? మహానుభావా! నీయాజ్ఞయైనచోఁ గార్యక్రమ మారంభించెదను అని విన్నవించెను. వాసుదేవుఁడు ధర్మజుని భక్తితాత్పర్యములకు సంతసించి బావా! నీపూర్వపుణ్యమున నీకు మేలు కలుఁగఁగలదు. విఘ్నకారకు లున్నచో వారికంఠములను చ్ఛేదింప నాచక్రము సిద్ధముగ నున్నది. నీపవనకార్యమును నీవు నిర్విచారముగ నెఱవేర్చికొనుము అనిపలికెను.

అంతట ధర్మరాజు ఋత్విజుల సాహాయ్యమున నధ్వరకర్మ మారంభించి దానహోమయజనాదులు నెఱవేర్చి భీష్మునిఁ జూచి తాతా! యింక ధర్మశాస్త్రానుసారముగ నర్ఘము నీచే వలయును. తదర్ఘమున కీసభలో నెవ్వ రర్హులో నిర్ణయించి చెప్పుము. అనియడిగెను. గాంగేయుఁడు, ధర్మజా! స్నాతకుఁడు, పిత, ఇష్టబంధువు, ఋత్విజుఁడు, అల్లుఁడు, మేదినీపతి, వీరాఱుగురును బూజార్హులు. వీరంద ఱీసదస్యులలోనే కలరు. వీరినే ప్రత్యేకముగగూడ నర్చింపవచ్చును. లేక గుణోత్తరుఁడగువాని నొక్కనినే యారాధింపవచ్చునని కూడ శాస్త్రవిధి కలదు. ఈ విధియే విశేషవిధి. కావున నందఱిలో గుణాఢ్యుఁడగు శ్రీకృష్ణుని మొదట నర్చించుట యుక్తమని నాయభిప్రాయము.

శ్రీకృష్ణుఁడు మానవమాత్రుఁడని తలంపకుము. పరమాత్మాంశభూత మగుకళ యని గ్రహింపుము. రామభార్గవ నృసిం

హ వామన వరాహ దత్తాత్రేయాది బహువిధరూపములనవత రించి జగంబులఁ బ్రోచిన మహానుభావుఁ డితఁడే. యోగీశ్వరులకు ధ్యేయమగు వస్తు వితఁడే యిప్పుడు సృష్టికర్తయగు నన జ్యేష్ఠుని ప్రార్థనవలన దుష్టసంహారార్థము లీలామానుషవిగ్రహుఁడై వసుదేవరూపమునవున్న కశ్యపున కాత్మజుండైన శ్రీమహావిష్ణు వితఁడే. ఇట్టి భగవంతుని సమక్షమునఁ బ్రతు వొనరించెడి మహాభాగ్యము నీకుఁ దటస్థించినది. నీవు ధన్యాత్ముఁడవు. నీపూర్వపుణ్యము మంచిది అనుటయు ధర్మరాజు తద్వాక్యామృతముం గ్రోలి యానంద రసాస్వాదమునఁ బారవశ్యము చెంది విమీలితలోచనుఁడై కొంతతడవునకు నేత్రములు తెఱచి యర్ఘ్యాద్యద్రవ్యములతో శ్రీకృష్ణునిఁ బూజించెను.

### శిశుపాలుని క్రోధవచనములు.

అంతట యదునందనునకు సహజవైరి యగు శిశుపాలుఁడు మండిపడి లేచి ధర్మజునిఁ గ్రోధదృష్టులతోఁ జూచుచుఁ గౌంతేయా! యీ మహాసభలో నుత్తమక్షత్రియు లగువిందము మహారాజులు పుంకాసనులచెంతమున నగ్రపూజ కర్హులై వెలుఁగుచుండ నభిషేకాది రాజచిహ్నములకు దూరుఁడై తుచ్ఛకము పగిది హీనుఁడగు నీగోపాలున కీవు నగ్రపూజ గావించితివి? నే నసత్యమాడనని యీహ [illegible] నీసత్యసంధత యిదేనా? అధర్మవర్తనుఁడవగు నీకీధర్మరాజ

నారు పుష్పఫలముల నిచ్చు భౌమవాసరమునకు మంగళవార నామము వంటిదని స్పష్టపడినది ఈమహారాజులనందఱ నాహ్వా నించుట యిట్లవమానము సలుపుటకా? చాలుఁ జాలు. అని పలికి భీష్మునిఁ గాంచి గాంగేయా! తలయంతయు నెఱసి వృద్ధుఁడవయ్యును నీవు గూడ యుక్తాయుక్తవివేకశూన్యుఁడవై నీచుఁ డగుగోపాలునిఁ బెద్దగఁ జేసి వందివలె స్తోత్రపాఠములఁ జేసి నీ నీచగుణమును బయలుపఱిచితివి. అని యధిక్షేపించి కృష్ణుని ప్రక్కకుఁ దిరిగి యాదవా! నీ యర్హత నీ వెఱుంగక యిచ్చినంతన చాలుదునని ముందుగఁ బూజలందుకొంటివి. నీ యోగ్యతను దెల్పెదను వినుము.

మధుమక్షికను జంపి మధుసూదనుఁ డను పేరుపెట్టుకొని మధుఁడను నిశాచరుని సంహరించినట్లు డంబములు చెప్పుకొను చున్నావు. జరాసంధునివలనఁ బదునెనిమిదిపర్యాయములు పరాభవము నందిన పందవు. శత్రుభయమున నినుపచక్ర మొ కటి చేయించుకొని నేను చక్రధరుఁడను, భగవంతుఁడను, అని ప్రజలను మోసగించుచున్నావు. కంసభూపాలునియొద్ద గోవు లను గాచుచుండి యతని సంహరించిన స్వామిద్రోహివి. వృషభ రూపము దాల్చిన యరిష్టుఁడను రాక్షసుని వధించి గోహత్యను చేసిన మహాపాతకుఁడవు. నీ వెట్లు పూజార్హుఁడవైతివి? అని నిర్భయముగఁ బలికి సభాసదులగు భూపతులను గాంచి మహీ మండలాధిపతులారా! సింహములు వలె మీరందఱు చూచు

చుండ నీకుంతీపుత్త్రుఁ డడవినక్కవంటి యాదవుఁ బూజించెను. ఇది మా కందఱకును గొప్ప యవమానము. అని గంభీరముగ భాషించి తన మిత్త్రులగు నరకాత్మజాదులతోఁ గలిసి కృష్ణునిఁ బరిహాసించుచుఁ ,జప్పట్లు గొట్టుచు నట్టహాసము చేయుచుండెను.

### భీష్ముని భాషణము

అంతట భీష్ముఁడు చైద్యుఁడు చేసిన శ్రీకృష్ణనిందకుఁ గ్రుద్ధుఁడై కన్నులెఱ్ఱజేసి సదస్యులను గాంచి మేఘగంభీరధ్వనితో మహారాజులారా! నేనిప్పు డీమహాసభలోఁ జేయించిన శ్రీకృష్ణార్చనము నెవ్వరు సహింపఁజాలరో వారి శిరంబులందు నాపాదము పెట్టెదను పౌరుషవంతులైనచో ధనుస్సుల నెక్కుపెట్టి రణరంగమునకు దిగవలయును. అని పలికెను.

### శిశుపాలాదులు సభనుండి లేచిపోవుట

చేదిభూపతిమిత్త్రులగు బాణుఁడు, ద్రుమఁడు, నరకాత్మజుఁడు, ఉత్తమౌజసుఁడు, దంతవక్త్రుఁడు, రుక్మి, సుబలుఁడు, ఆహుకి, కాలయవనుఁడు, వసుఁడు, మున్నగాఁ గల క్షోణీనాథులు భీష్ముని పరుషవచనములకు మహారోషము కలిగి కన్నులెఱ్ఱచేసి మంత్రబద్ధములగు భుజంగముల కైవడి బుసఁగొట్టఁ గొడంగిరి. శిశుపాలుఁ డాభూమీశులఁ జూచి రెట్టించిన

రోషంబున సురాసురులను సయితము పరాభవింపఁ జాలిన మీరింకను నూరకుందురేల? లెండు. రండు. వీరందఱుఁ జూచుచుండఁగ నిప్పుడే యీకృష్ణునిఁ దెగటార్తును చూడుఁడు. అని కఠినముగఁ బలికి సభలోనుండి తీవ్రముగ వెడలిపోయెను. అతని మిత్రులగు భూపాలురందఱును దిగ్గున లేచి వాని వెనువెంటనే యరిగిరి.

## శిశుపాలునిదూత శ్రీకృష్ణునకు సందేశము తెలుపుట

శిశుపాలుఁడు మిత్రులతోఁ గూడి తన శిబిరమునకుఁ జేరి సైన్యములను యుద్ధమునకు సిద్ధపఱచుకొని మేధావి యగు నొక దూతను కృష్ణునియొద్దకుఁ బంపెను. అతఁడు వాసుదేవుని సభ కరిగి పైకి శిశుపాలునితో సంధిచేసికొనుమను నర్థము వచ్చునట్లును లోపల యుద్ధమునకు సిద్ధపడుమని తిరస్కారపూర్వక మగు నర్థము వచ్చునట్లును శ్లేషవాక్యములు పలికెను. అప్పుడు కృష్ణప్రేరితుఁడై సాత్యకి వార్తాహరా! యింక నీ శ్లేషోక్తులు కట్టిపెట్టుము. నీ యభిప్రాయము తెలిసినది. మాయన్న మీ శిశుపాలుని శతాపరాధములను క్షమించెదనని శపథము చేసియుండెను. నేటితో నా ప్రతిన పూర్తియైనది. ఇంక నతఁ డొక్క యపరాధ మొనరించినచో వానిని సంహరించుటకు శ్రీకృష్ణుఁడు సిద్ధముగ నున్నాఁడు. ఈ వార్త దృఢముగ నీ ప్రభువుతోఁ జెప్పుము పొమ్ము. అని నుడివెను. పిదప

మాతయు భయమును విడిచి చైద్యుని పరాక్రమమును వర్ణించి మా ప్రభువు మిమ్ములను రణరంగమున వధించుటకు సిద్ధపడి యుండెను. మీరును యుద్ధసన్నద్ధులుగ నుండుడు. అని స్పష్టముగఁ జెప్పి వెడలిపోయెను.

## — శ్రీకృష్ణ శిశుపాల యుద్ధము —

అంతట శ్రీకృష్ణపక్షావలంబులగు గదుఁడు, బలభద్రుఁడు, ఉల్ముకుఁడు, యుధాజిత్తు, శిని, శారణుఁడు, విదూరథుఁడు, నిషధుఁడు, సుధన్వుఁడు, ప్రద్యుమ్నుఁడు, పృథుఁడు, అక్రూరుఁడు, ప్రసేనజిత్తు, ఉద్ధవుఁడు మొదలగు మహాయోధులు సైన్యముల నాయత్తపఱచుకొని వివిధాయుధములను ధరించి భూనభోంతరాళములు మాఱుమ్రోఁగునట్లు యుద్ధదుందుభులు మ్రోఁగించిరి. శ్రీకృష్ణుఁడు శార్ఙ్గ చక్రాద్యాయుధములనుధరించి సేనాపతి వారముచు వెంటఁబెట్టుకొని శత్రువులఁ బరిమార్చుటకుఁ బోవుచుండెను. అంతలో శిశుపాలుఁడు తన బలములతోఁగూడి రణదుందుభులు మ్రోఁగించుచు శ్రీకృష్ణుని బలములను దాఁకెను. ఉభయబలంబులలో నేనుంగు నేనుంగును పదాతిని బదాతియు నాశ్వికుని నాశ్వికుఁడును రథికుని రథికుఁడును దలఁబడి ఘోరముగ భయంకరమగు తుములయుద్ధము చేయఁదొడంగిరి. అప్పుడు శ్రీకృష్ణశిశుపాలురు పరస్పరము పటునిపుణమగు నస్త్రయుద్ధము చేయఁజొచ్చిరి. అంతఁ జైద్యు

దు మున్ముందుగ ననేకమహాస్త్రములను బ్రయోగించెను. వాసుదేవుఁ డాయస్త్రముల నన్నింటిని దన బ్రత్యస్త్రములతో సంహరించెను.

— శ్రీకృష్ణుఁడు శిశుపాలుని సంహరించుట —

అంతటఁ జేదిపతి చేయునది లేక యమర్షాతిరేకమున గోవిందుని నిందింపఁ దొడంగెను. శిశుపాలుఁ డట్లు నిందావాక్యములు పలుకుచుండఁగనే శ్రీకృష్ణుఁడు తన చక్రముచే వానికంఠమును ఛేదించెను. తోడనే శిశుపాలుని దేహమునుండి యొక దివ్యతేజస్సు పైకి వచ్చి శ్రీకృష్ణుని దేహములోఁ బ్రవేశించెను. అప్పు డాకసమునుండి దేవతలు జయజయ ధ్వనులు చేయుచుఁ బుష్పవర్షమును గురియించిరి.

శ్రీ శ్రీ శ్రీ

---